# భారతదేశంలో తాగునీటి హక్కు


ఆంగ్లమూలం: సి. రామచంద్రయ్య

తెలుగుసేత: ఆర్వియార్





**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,

హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

# భారతదేశంలో తాగునీటి హక్కు

అంగ్లమూలం: సి. రామచంద్రయ్య

తెలుగు సేత: ఆర్వీయార్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

**RIGHT TO DRINKING WATER IN INIDA** *by C. Ramachandraiah,*
*English to Telugu Translation by R Venkateswara Rao*

రాజకీయ/సామాజిక/ఆర్థిక శాస్త్ర గ్రంథాలు

ప్రచురణ నెం : 19

ప్రథమ ముద్రణ : అక్టోబర్, 2004



**వెల : రూ. 6-00**

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435, విజ్ఞాన భవన్, బ్యాంక్‌స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.
E-mail : visalaandhra@yahoo.com

**విశాలాంధ్ర బుక్ హౌస్**
(అబిడ్స్, సుల్తాన్ బజార్) హైదరాబాద్,
విజయవాడ, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

అక్షరాలంకరణ : కాంపాక్ట్ గ్రాఫిక్స్ హైదరాబాద్.

ముద్రణ : శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్. ఫోన్ : 23224831.

# భారతదేశంలో తాగునీటి హక్కు

సి. రామచంద్రయ్య★

## సారాంశం

**భా**రతదేశంలో యిటీవల తాగునీటి హక్కు మరింత ప్రాముఖ్యం సంతరించుకుంది. యీ అంశానికి సంబంధించి ఐక్యరాజ్యసమితి, యితర అంతర్జాతీయ సంస్థలు ప్రకటనలు చేస్తున్నాయి. భారత రాజ్యాంగం 21వ అధికరణం ప్రకారం జీవించే హక్కులో భాగంగా, నీటి హక్కు వుందని చెప్పడం జరిగింది. వీటన్నిటివల్ల యీ విషయం గురించి చైతన్యం పెరగడానికి దోహదం కలిగింది. పౌరుల ప్రాథమిక హక్కుల్ని పరిరక్షించి, నెరవేర్చే బాధ్యత ప్రభుత్వం మీద వుంది. యీ సందర్భంలో జీవించే హక్కులో భాగంగా పరిశుభ్రమైన తాగునీరు అందించవలసిన బాధ్యత కూడా ప్రభుత్వం మీదవుంది. యీ విషయానికి సంబంధించి పేదల స్థితిగతులలో పెద్ద మార్పేమీ లేకపోయింది. సరిపడా వాడకానికి నీరు అందుబాటులోకి రావడంలేదు. దీనికి తోడు లక్షలాదిమంది నీటి కాలుష్య దుష్ఫలితాల వల్ల బాధలుపడుతున్నారు. నీటిని ఒక ఆర్థిక అవసరంగా గుర్తించే దిశగా దేశంలో మార్పు వచ్చింది. యిది విధానాల ఫలితం. నీటిరంగంలో కార్పొరేట్ వ్యాపార సంస్థలకు అనుకూలమైన విధానాలని ప్రభుత్వం అనుసరిస్తూ వుంది. యీ సమస్యల్లో కొన్నింటిని యీ పత్రం పరిశీలిస్తుంది. ప్రభుత్వ పాత్రతోబాటుగా 'కార్పొరేట్ పెట్టుబడి' రంగ ప్రవేశం చెయ్యడం వలన పేద ప్రజలకీ, బడుగు వర్గాలకీ నీటి హక్కు సాధించుకోవడం కష్టం అవుతుంది. ఆకలికి వ్యతిరేకంగా సాగే 'ఆహారం హక్కు' ప్రచారంలో నీటి హక్కునీ గట్టిగా పొందుపరచాలని యీ పత్రం వాదిస్తోంది.

---

★ సి.రామచంద్రయ్య, సెంటర్ ఫర్ ఎకనామిక్ అండ్ సోషల్ స్టడీస్, (సెస్-cess) బేగంపేట, హైదరాబాద్ - 500 016 లో రీడర్. ఇ-మెయిల్: rama@cess.ac.in

## ఇందులో ...

# భారతదేశంలో తాగునీటి హక్కు

## పరిచయం

ఏ సమాజంలోనైనాగానీ ప్రజల సంక్షేమం కోసం రెండు ముఖ్యమైన సమస్యలుంటాయి : (ఆదాయం) పేదరికం, శుభ్రమైన తాగునీరు అందు బాటులో వుండడం, పారిశుద్ధ్యం. మిగతా విషయాలలో మాదిరిగానే భారతదేశం యీ రెండు అంశాలలోనూ, రాజ్యాంగ ఆదేశాలు వున్నా, అధికార ప్రకటనలు వున్నా వెనుకబడే వుంది. కోట్లాది భారతీయులు, ముఖ్యంగా మహిళలు, పిల్లలు తీవ్రమైన దారిద్ర్య పరిస్థితుల్లో నివసిస్తున్నారు (లేదా దిక్కులేక అలాంటి పరిస్థితుల్లో నివసించవలసి వస్తోంది). యేరకమైన మంచి జీవన పరిస్థితులూ వాళ్ళకి వుండడం లేదు. 226 మిలియన్ల మందికి రక్షితనీరు అందుబాటులో లేదు. 70 శాతం జనాభాకి (సుమారు 640 మిలియన్ల మందికి) మౌలిక పారిశుద్ధ్య సౌకర్యాలు లేవు. భారతదేశ జనాభాలో 46 శాతం మంది పరమ పేదరికంలో జీవిస్తున్నారు (అంటే రోజుకు ఒక అమెరికన్ డాలర్ కంటే తక్కువలో). 15-49ల మధ్య వయసులో గర్భిణీ స్త్రీలు 88 శాతం మంది రక్తహీనతతో బాధపడుతున్నారు. 5 సంవత్సరాల వయసులోపు పిల్లల్లో మూడింట ఒక వంతు మంది నిర్బంధ బాలకార్మికు లవుతున్నారు (హక్, 1997) నీటి సంబంధమైన వ్యాధులు 1.5 మిలియన్లు మంది 5 యేళ్ళలోపు పిల్లల్ని బలిగొంటున్నాయి. (ఒక్క అతిసార వ్యాధివల్లనే 500,000 మంది పిల్లలు బలవుతున్నారు.) భారతదేశంలో నష్టపోయే పనిదినాలు సాలుకు 180-200 మిలియన్లని అంచనా (కృష్ణకుమార్, 2003, పారిఖ్ యితరులు 1999).

మృత్యువాత పడజేసే పెద్ద కారణాల్లో 37 వ్యాధుల్ని గుర్తించేరు. అభివృద్ధి చెందుతున్న దేశాల్లో వీటిలో 21 వ్యాధులు నీటికీ, పారిశుద్ధ్యానికీ, సంబంధించినవే. అభివృద్ధి చెందుతూవున్న దేశాల్లో ప్రతి యేడూ నీటి కారక వ్యాధులే 4 మిలియన్ల మంది శిశువులకీ, పిల్లలకీ మరణాంతకమవుతున్నాయి. ఆ విధంగా నీటి పరిమాణ నాణ్యతల

సమస్యే జీవితానికి మౌలిక ఆధారంగా తయారవుతుంది. (ఎపిపిఇఎన్, 1998.) చైనాలో శుభ్రమైన తాగునీరు, పారిశుద్ధ్యం, విస్తృతంగా అందుబాటులో వున్నాయి. దానివల్ల, నీటి వనరుల్లో హెచ్చుస్థాయి కాలుష్యం వున్నాగానీ ఆరోగ్యానికి భంగం కలిగించే ప్రాతికూల్యాల్ని కుదించడం జరిగింది (ప్రపంచ బేంక్, 1997). భారతదేశంలో ఒక విచిత్రమైన పరిస్థితి వుంది. ఫుడ్ కార్పోరేషన్ ఆఫ్ ఇండియా (FCI) గోదాముల్లో లక్షలాది టన్నుల, ఆహారనిల్వలు ముక్కి మగ్గిపోతూ వుంటే, అటుపక్క కోట్లాది ప్రజలు కనీస ఆహారం అందక యిబ్బందుల పాలవుతున్నారు. కొనుగోలుశక్తి లేకపోవడంవల్ల ప్రస్తుతం నిలువ వున్న ఆహారధాన్యాలు, దారిద్రరేఖ దిగువన వున్న ప్రతి యింటికీ ఒక టన్ను ఆహారంతో సమంగా వున్నాయి.[1] యీ పరిస్థితి "పుష్కలంగా వుండే ఆకలి" అన్నట్టుగా వుంది. ఓ పక్క యెటు చూసినా ఆకలి, యిటుపక్క కుప్పలుగా పేరుకుపోయే ఆహార ధాన్యం నిలవల సిగ్గుమాలిన పరిస్థితి అన్నట్టు వుంది. (డ్రైజ్ సేన్ 2002). "యీ విషయంలో ఆహారం హక్కును భారతదేశం అత్యంత హీనంగా ఉల్లంఘించింది". (మహేంద్ర దేవ్, 2003.)[2]

నీటిని ఒక ఆర్థిక వనరుగా లేదా "సొమ్ముచేసుకునే వనరుగా" చూసే సైద్ధాంతిక ప్రత్యామ్నాయం ఒక అంశంమీద ఆధారపడి ఉంది. అదేమిటీ అంటే సరకుల రవాణా నియంత్రణకు ప్రధాన యంత్రాంగం మార్కెట్ అన్నది. యీ సైద్ధాంతిక తీరును వెనకేసుకు వచ్చేవాళ్ళకూడా నీటి స్థానాన్ని భర్తీ చేసేది మరేదీ లేదనే విషయాన్ని కాదనలేరు. భూమ్మీద గాలిని మినహాయిస్తే జీవనాధారానికి సంబంధించి మరేదీ నీటితో పోల్చతగింది లేదు. అంచేత నీరు అందుబాటులో వుండడం అనేది ప్రత్యా మ్నాయం యెంతమాత్రమూ కాదు. ప్రతివాళ్ళకీ నీరు అవసరమే. అలాంటి అద్వితీయస్థానం నీటికి ఉంది. తద్వారా అది "ఒక సాంఘిక సంపద. ఏ మానవ సమాజానికేనా మౌలికమైన ఉమ్మడి సరుకు" (వెట్రాల్లా, 2001.) నీరు యితర వనరుల కంటే మౌలికంగా భిన్నమైంది. ఎందుకనీ అంటే : యిది ప్రాచీనుల నాలుగు ప్రాకృతిక

అంశాల్లోనూ ఒకటి (మిగిలినవి గాలి, నేల, నిప్పు). ఆ రకంగా జీవితానికి మూలకందం. ఆరోగ్య విషయంలో, అంటువ్యాధులని[3] నివారించడం విషయంలో చాలా ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. నీటిని ముఖ్యమైన సాంఘిక పాత్ర వుంది. ఆకాశం నుంచే వచ్చే పరిశుభ్రమైన నీరు మానవాళికి "కానుక". ప్రజా వనరులలో భాగంగా దీన్నిగుర్తించేరు. (స్మెట్స్, 1999). తిండి లేకుండా మనుషులు కొన్ని వారాలపాటు బతకగలరు. కాని నీరు లేకపోతే కొన్ని రోజులలోనే చనిపోతారు. (ఎపిపిఇఎన్ 1998). "అంతర్జాతీయ కార్పొరేషన్ల అధికారమూ, ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఆవిర్భవించడంతోబాటుగా ప్రపంచ నీటి వ్యవస్థలు పతనం కావడమూ, తరిగిపోవడమూ జరిగేయి. యిందులో సమాజాలు స్థానిక ప్రజలు, రైతులు తమ హక్కుల్ని కోల్పోయేరు (గ్లీక్, 2002). ప్రపంచం లోని అనేక ప్రాంతాల్లోని దేశాల్లో నీటిని భారీగా బదలాయించడంలో అంతర్జాతీయ వాణిజ్యం జరుగుతుంది. సముద్రాలని దాటిస్తూ భారీ సీల్డ్ సంచుల్లో నీటిని రవాణా చేసేందుకు అనేక కంపెనీలు సాంకేతిక పరిజ్ఞానాన్ని రూపొందిస్తున్నాయి. యిది అమ్మకం కోసం (రైనా, 2002).

కోట్లాది ప్రజలకి తగినంత నీరు అందుబాటులోవుండడం లేదు. చాలా దేశాల్లో నీటి అవసరాలు ప్రైవేటుపరం అవుతున్నాయి. ప్రపంచంలో నీటి ప్రైవేటీకరణకి వ్యతిరేకంగా ప్రతిఘటన పెరుగుతోంది. పౌరసమాజ కార్యకలాపాలవల్ల పౌరుల సామాజిక, ఆర్థిక హక్కులపట్ల చైతన్యం పెరుగుతున్నది. సుప్రీంకోర్టు తీర్పులు వెలువడుతున్నాయి. యునెస్కో (UNESCO) నవంబరులో నీటి హక్కును స్పష్టమైన హక్కుగా ప్రకటించింది. యిలాంటి పరిస్థితి వల్ల "నీటి హక్కు" సమస్య గోదా చర్చల్లోకి వచ్చింది. యీ నేపథ్యంలో భారతదేశంలో తాగునీటి హక్కు మీద చర్చకు ప్రాధాన్యం సమకూరుతోంది.

పౌరులకు చాలినంత తాగునీటిని అందించడం ప్రభుత్వ రాజ్యాంగ విహిత బాధ్యత. అలాగే నీటి వనరుల్ని సమష్టి సరుకుగా కాపాడ్డమూనూ. యీ దృష్టితోనే యీ పత్రం సాగుతుంది. మానవహక్కుల దృష్ట్యా పౌరులు

తమ హక్కుల్ని అనుభవించేటట్లు చెయ్యడం పరిరక్షించడం ప్రభుత్వ బాధ్యత. పౌరులు తమ ప్రాధమిక హక్కుల్ని సాధించుకునే సామర్ధ్యాన్ని దెబ్బతీసే యే ప్రభుత్వ విధానమైనా అలాంటి హక్కుల ఉల్లంఘనే అవుతుంది. తాగునీటి రంగంలో రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల విధానాల్ని ఈ దృష్ట్యానే విశ్లేషించడం జరిగింది.

ఈ పత్రంలో నీటి హక్కు గురించి ఐక్యరాజ్యసమితి ప్రకటన జీవన హక్కులో భాగంగా యీ హక్కు గురించి న్యాయస్థానాల ప్రకటనలనీ వివరించడం జరిగింది. కొంతకాలంగా యీ రంగంపట్ల మౌలిక వనరు ద్వారా తాగునీటి సరఫరా పట్ల కనిపించిన తక్కువ ప్రాధాన్యం వివరించే ప్రయత్నం జరిగింది. 1991 నుంచీ భారత దేశం ఆర్థిక సరళీకరణ, ప్రయివేటీకరణ విధానాల్ని అనుసరిస్తోంది. అంచేత నీటి రంగంతో సహా మౌలిక సేవల వ్యాపారీకరణ దశలో మొగ్గ కనిపిస్తోంది. యీ మార్పు గురించి చర్చించాక మిగిలిన అంశాల్ని పరిశీలించడం జరిగింది. బాటిల్ నీటి సరఫరా వ్యాపారంలో భూగర్భ జలాల వెలికితీత, ప్రైవేట్‌రంగానికి అనుకూలంగా నదీ జలాల్ని గుత్తకియ్యడం లాంటి ప్రైవేటీకరణ గురించి వివరించడం జరిగింది. హైద్రాబాద్ నగరానికి సంబంధించి కార్పొరేట్ రంగానికి అనుకూలంగా ధర నిర్ణయించే తతంగం గురించీ సంక్షిప్తంగా ప్రస్తావించడం జరిగింది.

## నీటి హక్కు : అంతర్జాతీయ ఒప్పందాలు

మానవ హక్కుల సార్వజనీన ప్రకటన (UDHR) ప్రకటన మొదట్లో వెలువడిన నాటినుంచి నీటి హక్కు అనేక అంతర్జాతీయ పత్రాల్లో చాలాకాలంగా చోటు చేసుకుంటూనే ఉంది. యిది వెల్లడిగానో, గర్భితంగానో వుంటూనే వచ్చింది. నీటి హక్కు ప్రత్యేకంగా జీవించే హక్కులో ముఖ్యమైన భాగంగా, సాధారణ మానవ హక్కులలో భాగంగా యీ పత్రాల్లో వుంటూనే వచ్చింది (అనుబంధం-1 చూడండి). అంతర్జాతీయ ఒప్పందాల్లో నీటిని గర్భితంగా ఒక మౌలిక వనరుగానే భావించడం జరిగింది. అదీగాక, పరిశుభ్రమైన నీరు అందుబాటులో ఖాయంగా వుండనట్లయితే, అనేక హక్కులు, ముఖ్యంగా ఆహారం,

ఆరోగ్యం, అభివృద్ధి లాంటి వాటిని హామీ యిచ్చే యెన్నో స్పష్టమైన హక్కుల్ని సాధించుకోవడం జరగదు (గ్లిక్, 1999).

మొదటి యుడిహెచ్ఆర్ (UDHR) సర్వసమగ్రం కాదు. నీటిహక్కును స్పష్టమైన తీరులో పొందుపరచడం అనవసరం అని భావించేరు. యేమంటే అది మానవ మనుగడకు అంత ముఖ్యమైంది గనుక. పౌర, రాజకీయ హక్కుల అంతర్జాతీయ ఒప్పందంలో (ICCPR) 6(1) అధికరణంలో జీవించే హక్కును స్పష్టంగా పొందుపరచారు. అదేం చెపుతుందీ అంటే "మీ హక్కుని చట్టంద్వారా పరిరక్షించడం జరుగుతుంది. యెవళ్ళనీ నిరంకుశంగా జీవనహరణం చెయ్యడం జరగదు". నీరు జీవితానికి అత్యావశ్యకం అయింది. అంచేత ఆచరణలో జీవితానికి నీటి అందుబాటు తగ్గేటట్టు, పొందలేనట్టు తయారయే ప్రభుత్వ విధానాలన్నీ ప్రజల జీవితాన్ని హరించి వేస్తున్నట్టే. ఘనాలో నీటి ప్రైవేటీకరణ, నీటి ధర పెంచడానికి స్వయంచాలకమైన (ఆటోమేటిక్) సుంకాల సవరణలు, ఫలితంగా పేద ప్రజలకు నీరు తక్కువ అందుబాటులో వుండడం జరిగేయి. దీనిమీద వ్యాఖ్యానిస్తూ యిలా అన్నారు: "యిలాంటి విధానాలని అనుసరించడం అంతర్జాతీయ మరియు ఘనాదేశ చట్టాల ప్రకారం "ఉద్దేశపూర్వకంగా జీవిత హక్కును తొలగించడం." ఘనాలో నీటి ప్రైవేటీకరణ గురించి అంతర్జాతీయ నిజ నిర్ధారణ కమిటీ యీ వ్యాఖ్య చేసింది (ISODEC, 2002· 69-71). కోట్లాది ప్రజానీకానికి "తగినంత పరిమాణంలో ఆహారం, నీరు, బట్ట, గృహవసతి, మందులు లాంటి మౌలికమైనవి అందుబాటులో లేకుండా చేసే" అభివృద్ధి రహిత మొండిపరిస్థితులు వుంటే అవి మానవ హక్కుల్ని, భూరిస్థాయిలో నిస్సిగ్గుగా, దారుణంగా ఉల్లంఘించడాన్నే సూచిస్తాయి. (ఐక్యరాజ్యసమితి, గ్లిక్ ఉల్లేఖన, 1999).

యునెస్కో (UNESCO) ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక హక్కుల కమిటీ 29వ సమావేశం నవంబరు 2002లో జరిగింది (జనరల్ కామెంట్ 15). మొట్ట మొదటిసారిగా అది ఆ సమావేశంలో నీటి హక్కును మౌలిక హక్కుగా జీవించే హక్కు కింద, స్పష్టంగా ప్రకటించింది. పౌరులు యీ హక్కు సాధించేందుకు గాను, హామీ వుండేటట్టు దేశాల

మీద అనేక బాధ్యతలు విధించింది. రక్షిత తాగునీరు జీవితానికి, ఆరోగ్యానికి మౌలిక హక్కు అని స్పష్టంగా ప్రకటించింది. అది "అన్ని మానవ హక్కుల్ని సాధించుకునేందుకు పూర్వావసరం" అని చాటింది. ప్రతిపౌరునికీ, **శుభ్రమైన, తగినంత భరించగలిగేస్థాయిలో అందుబాటులో వుండే తాగునీరు** వ్యక్తిగత అవసరాలకు సరిపడేటట్టు పొందే హక్కు వుంది. అవసరాలు అంటే గృహ పారిశుద్ధ్యం, వంట, ఆరోగ్యం, (ఊనిక మూలంలోనే ఉంది) అంతేకాదు, తాగునీరు హక్కును సాధించుకునే తీరు నిలకడగా వుండాలి. కూడా. యీ హక్కు ప్రస్తుత తరం, భావితరాలు సాధించుకునేటట్టు వుండాలి (ఐక్యరాజ్యసమితి, 2002).

ఈ హక్కుకు సంబంధించిన ముఖ్య నిబంధనలనీ ఆ సాధారణ వ్యాఖ్య (general comment) మరింత వివరంగా చెప్పింది. **భద్రత ఖాయంగా** వుండడానికి నీరు హాక్ష్మక్రిములు లేకుండా వుండాలి. అలాగే వ్యక్తి ఆరోగ్యానికి భంగం కలిగించే పదార్థాలు లేకుండా వుండాలి. ఆమోదయోగ్యమైన రంగు, రుచి, వాసన కలిగి వుండాలి. యిక **కావలసినంత** అంటే నీటి సరఫరా తలసరి సుమారుగా 50 లీటర్లు లేదా కనీసం అవసరమైన 20 లీటర్ల స్థాయిగా వుండాలి. ఒడంబడికలోని యితర హక్కుల సాధనతో దీన్ని ముడిపెట్టకూడదు. అందుబాటులో వుండడం అంటే ఆ ఆవరణలోనే లేక పొరుగునే వుండడం. అది కూడా క్రమం తప్పకుండా వుండాలి. దొరుకుతుందో లేదో నన్న భయం వుండకూడదు. యితర మానవ హక్కుల లాగానే తాగునీటి హక్కును అమలుపరచడంలో ప్రభుత్వాంగాలు వివక్షాపూరితంగా వుండరాదు, సమానత్వం పాటించాలి. అంతేకాదు, మహిళలకీ, పిల్లలకీ, మైనారిటీ వర్గాలకీ, స్థానిక ప్రజానీకానికీ, వలస వచ్చిన వాళ్ళకీ, శరణార్థులకీ, దేశీయంగా స్వస్థలం పోయినవారికీ, వలస వచ్చిన కార్మికులకీ, ఖైదీలకీ, నిర్బంధంలోవున్న వాళ్ళకీ యింకా అలా నీటి హక్కును వినియోగించుకోడంలో కష్టాలు యెదుర్కొంటున్న వాళ్ళకీ ప్రత్యేక శ్రద్ధ చూపించాలి.

నీటి హక్కు ప్రభుత్వాల మీద "మన్నించడం, పరిరక్షించడం, ఫలవంతం చెయ్యడం" అనే నిబంధనల్ని మోపుతుంది. మన్నించడం

నిబంధన తాగునీటి హక్కు అనుభవించడం విషయంలో ప్రభుత్వాలు నేరుగానో, పరోక్షంగానో జోక్యం చేసుకోవడాన్ని అడ్డుకుంటుంది. యీ నిబంధన మిగిలిన వాటితోబాటు, తగినంత తాగునీరు సమానంగా అందుబాటులో లేదనడాన్నో లేదా పరిమితం చెయ్యడాన్నో నిరోధిస్తుంది. యిక రక్షణ నిబంధన ఉంది. తాగునీటి హక్కు అనుభవించడానికి లేకుండా తృతీయపక్షం యే రకంగానూ అడ్డు తగలకుండా ప్రభుత్వాలు నిరోధించాలని యీ నిబంధన చెపుతుంది. అలాగే నీటి వనరుల్ని కలుషితం చెయ్యకుండా యెగాదిగా నీటిని తోడకుండా నిరోధించడానికి సఫలం చెయ్యడం నియమం అంటే తాగునీటి హక్కును సంపూర్ణంగా సాధించుకునే దిశలో అందుకవసరమైన చర్యల్ని ప్రభుత్వాలు తీసుకోవల్సి ఉంది అని చెప్పడం. యితర అంశాలతో బాటుగా యిందులో ఒక విషయం కలిసి వుంది. అదేమిటీ అంటే జాతీయ, రాజకీయ శాసన వ్యవస్థల్లో యీ హక్కును సాధించుకునేందుకు తగిన గుర్తింపును యివ్వడం.

'సాధారణ వ్యాఖ్య' కుండబద్దలు కొట్టినట్టు చెప్తోంది – నీటిని రాజకీయ, ఆర్థిక ఒత్తిళ్లకు పనిముట్టుగా యెన్నడూ వాడకూడదు అని. యిక నీటి సేవల ప్రైవేటీకరణ గురించి అది యిలా చెప్తోంది: "సమర్థవంతమైన నియంత్రణా వ్యవస్థ వచ్చేదాకా, ఒడంబడికతోనూ యీ సాధారణ వ్యాఖ్య తోనూ అనురూపంగా వుండే వ్యవస్థ వచ్చేదాకా (ప్రైవేటీకరణను) వాయిదా వేయాలి". ఒడంబడికలోని యితర హక్కులన్నింటినీ సాధించుకోవడంలో నీటి ప్రాముఖ్యాన్ని నొక్కి చెప్పడం జరిగింది. యిందులో మిగిలిన వాటితో బాటు ఆహారం హక్కు, ఆరోగ్యం హక్కు (పర్యావరణ, పరిశుభ్రతతోబాటుగా), పని హక్కు కలిసి వున్నాయి. యెట్టి పరిస్థితుల్లోనూ యేవ్యక్తికీ కనీస స్థాయి తాగునీరు లేకుండా పోకూడదు.

స్థానిక ప్రభుత్వాల నీటి నియమావళిలో అయిదు ప్రధాన సూత్రాలు వున్నాయి. వీటిలో ఒకటి యిలా చెప్తోంది. "పరిశుభ్రమైన స్తోమతుకు తగ్గ తాగునీరు అందుబాటులో వుండడం ఒక ప్రాథమిక హక్కు. అంచేత, అందరికీ నీరు, పారిశుద్ధ్యం సేవల్ని కల్పించే బాధ్యత ప్రభుత్వాలు మీద

వుంది," (లిస్బన్ సూత్రాలు 2001). మిగిలిన నాలుగు సూత్రాలు యివీ, నీటిని ఉమ్మడి సరుకుగా అజమాయిషీ చెయ్యాలి. జీవిత పర్యావరణ పునాదిగా నీటిని పరిరక్షించాలి. నీటిని పరిమిత ఆర్థిక వనరుగా నిర్వహించాలి. నీటిని భాగస్వామ్య సాంస్కృతిక సంపదగా కాపాడుకోవాలి. సమాజంలో బడుగువర్గాలవాళ్ళకి ముఖ్యంగా పిల్లలకి సంక్షేమాన్ని, ఆరోగ్యాన్ని అందించే కీలక ప్రాముఖ్యం వున్న అంశంగా రక్షితనీరు అందుబాటులో వుండాలి. యీ బడుగువర్గాలవాళ్లూ, పిల్లలూ కలుషిత నీటివల్ల త్వరగా జబ్బుల బారిన పడతారు. నీటి కారక వ్యాధులు, పుట్టుకొచ్చే బాహ్యాంశాల్నిబట్టి ప్రతివాళ్ళకీ రక్షితనీరు అందుబాటులో వుండాలని అనడం సామాన్య ప్రయోజనం దృష్ట్యానే (స్మెట్స్, 1999).

## భారతదేశంలో జీవన హక్కు, నీటి హక్కు

అంతర్జాతీయ ప్రకటనలు, పౌర సంఘాలు, న్యాయస్థానం తలుపులు తట్టడం, సుప్రీంకోర్టు అనేక హైకోర్టులు జోక్యం చేసుకోవడం లాంటివన్నీ ఒక సానుకూల ప్రభావాన్ని కలిగించాయి. భారతదేశంలో తాగునీటి అందుబాటును పరిశీలించేందుకు తగ్గ సానుకూల వాతావరణాన్ని కలిగించాయి. భారత రాజ్యాంగ ప్రాథమిక హక్కులలో 21వ అధికరణ ఉంది. దీని శీర్షిక "జీవిత పరిరక్షణ, వ్యక్తిగత స్వేచ్ఛ" - "చట్టరీత్యా స్థాపితమైన నియమానుసారం తప్ప యెవ్వరికీ జీవితాన్ని, వ్యక్తిగత స్వేచ్ఛనీ లుప్తం చెయ్యరాదు" అని అది చెప్తోంది. యీ అధికరణాన్నే సామాన్యంగా "జీవించే హక్కు" అధికరణం అంటున్నారు. పౌరుల హక్కులు, సంక్షేమం, ప్రభుత్వ పాత్ర అనే నూతన సమస్యలు యిటీవలి కాలంలో న్యాయస్థానం ముందుకు వచ్చేయి. జీవిత హక్కు పరిధిని గణనీయంగా పెంచడం జరిగింది. మరోలా చెప్పుకోవాలి అంటే సుప్రీంకోర్టు 21వ అధికరణం (వ్యక్తి జీవితం, స్వేచ్ఛ) లోని మాటలకు "కొత్త ఊపిరి పోసింది", "మానవ మర్యాదతోకూడిన జీవితం, సకల శక్తులూ పటుత్వంతోవున్న జీవితం" (వేణుగోపాల్, 2003) క్రమంగా యీ భావన విస్తరించుకుంటూ వచ్చింది. మానవ జీవితంలోని అనేక యితర ముఖ్య పార్శ్వాలు వచ్చి కలిశేయి. "కాలుష్య రహిత నీరు, గాలి జీవిత సౌందర్యాన్ని సంపూర్తిగా"

పొందేందుకు ఆరోగ్యం, పరిసరాలు, గృహవసతిలాంటివి అవసరం అన్న అంశాలు.[4] ఈ క్రమంలో ప్రజాహిత వ్యాజ్యాలు గణనీయమైన పాత్ర పోషించేయి.[5]

ఈ హక్కు దృష్ట్యా, పరిసరాలు, పర్యావరణ, గాలి – నీటి కాలుష్యం వగైరాలు 21వ అధికరణాన్ని ఉల్లంఘించడం కిందికి వచ్చి చేరాయి. అదీగాక "పౌరులు సురక్షితమైన తాగునీరు పొందేహక్కు 21వ అధికరణం ప్రకారం కలిగి వున్నారు" (సిన్హా, 2001). సుప్రీంకోర్టు యిటీవల యిచ్చిన ఒక తీర్పులో (డిసెంబరు 1, 2000) యిలాచెప్పింది. "యివాళ విస్తరిస్తున్న ధర్మశాస్త్రంలో, సమష్టి హక్కుల్ని పొదువుకునే పర్యావరణ హక్కులు" "తృతీయతరం హక్కులు" గా వర్ణితమవు తున్నాయి.[6] పౌర రాజకీయ హక్కులు "మొదటితరం హక్కులు" అనీ, "ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక హక్కులు", "రెండవతరం హక్కులు" అనీ పరిగణిస్తున్నారు.

"పరిశుభ్రమైన తాగునీరు అందుబాటులో వుండే హక్కు జీవితానికి మౌలిక హక్కు. 21వ అధికరణం ప్రకారం పౌరులకు పరిశుభ్రమైన తాగునీరు అందించే బాధ్యత ప్రభుత్వానిది"[7] అంటూ సుప్రీంకోర్టు యిటీవల పునరుద్ఘాటించింది. ప్రభుత్వం తగినంత తాగునీరు అందించాల్సి ఉంది. అదేకాదు నీటి వనరులని కాలుష్యం బారిన పడకుండా దురాక్రమణకు గురవకుండా పరిరక్షించాలి కూడా. నీటి వనరులను కాలుష్యం చేసే యే చట్టాన్నైనాగానీ "నిరంకుశమైందిగా ప్రజాప్రయోజనా లకు విరుద్ధమైందిగా 21వ అధికరణం కింద శుభ్రమైన నీటి హక్కును ఉల్లంఘించేదిగా పరిగణించాలి.[8]

ఈ తీర్పు వెలువడ్డానికి ముందే సుప్రీంకోర్టు కొన్ని హైకోర్టులు 21వ అధికరణం కింద శుభ్రమైన / తాగునీరు అందుబాటులోవుండే పౌర హక్కును సమర్థించాయి. సుభాష్ కుమార్ × బీహార్ ప్రభుత్వం కేసులో సుప్రీంకోర్టు యిలా చెప్పింది: జీవించే హక్కులో "కాలుష్య రహిత నీరు, గాలి పొందే హక్కు సంపూర్ణ జీవితానికి" అవసరం అన్న అంశం కలిసేవుంటుంది. చట్టాలని అతిక్రమించి జీవిత ప్రమాణాన్ని యేది

ప్రమాదకారకంగా చేసినా లేదా ఆటంకపరచినా రాజ్యాంగంలోని 32వ అధికరణాన్ని ఆశ్రయించే హక్కు ప్రతిపౌరునికీ వుంటుంది. జీవిత ప్రమాణాలకి భంగకరంగా వుండే నీటి కాలుష్యాన్ని, గాలి కాలుష్యాన్ని తొలగించుకునేందుకు యీ అధికరణాన్ని యెత్తి చూపించవచ్చు. ఎమ్.సి. మెహతా × కమలనాథ్ (1997) కేసులో సుప్రీంకోర్టు మినహాయింపులేని తీర్పు యిచ్చింది. ప్రభుత్వం నీటి సరఫరాని క్రమబద్ధం చెయ్యవలసి వుండడమే కాదు. ఆరోగ్య ప్రమాదాల్ని నిరోధించి, ఆరోగ్య పూరిత నీటిని పొందే హక్కు సాధించుకుందుకూ ఆసరా వుండాలి అని దాని తీర్పు. రోమన్ ధర్మశాస్త్రంలో "సాలస్ పాపులి ఎస్ట్ సుప్రీమా వెక్స్" (ప్రజా సంక్షేమమే అత్యున్నత న్యాయం) అన్న సూత్రం భారత రాజ్యాంగంలో విశ్వసించి మన్నించవలసిన భూమిక. ప్రభుత్వానికి ప్రజలు తమ హక్కుల్ని అవసరాల్ని సాధించుకునేటట్టు చెయ్యవలసిన క్రియాశీల పాత్ర వుంది" కర్ణాటక ప్రభుత్వం × ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం(2000) అన్న కేసులో, నీటి హక్కు, జీవన హక్కు అని కోర్టు ప్రకటించింది. ఆ రకంగా అది ప్రాథమిక హక్కు అని చాటింది. నర్మదా బచావో ఆందోళన్ × భారత ప్రభుత్వం (2000) కేసులో బతికి బట్టకట్టడానికి నీరు మౌలిక అవసరం. యిది "మానవ హక్కుల్లో, జీవిత హక్కుల్లో భాగం" అని కోర్టు ప్రకటించింది. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు పైన చెప్పుకున్న తీర్పులని యెన్నింటినో ఉదాహరిస్తూ పౌరులకు తాగునీరు అందించవలసిన బాధ్యత ప్రభుత్వానిదే అని పునరుద్ఘాటించింది. యీ తీర్పు పి.ఆర్. సుభాషణ్ చంద్రన్ × ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యితరులు (2001) అన్న కేసులో యిచ్చింది. ఆ రకంగా, ప్రతి పౌరునికీ తగినంత తాగునీరు సరఫరా చెయ్యడమూ, నీరు కాలుష్యం బారిన పడకుండా కాపాడ్డమూ అనేది ప్రాథమిక ఆదేశిక సూత్రంగా భారత రాజ్యాంగంలో ఉంది.

## తాగునీరు అంత ముఖ్యమా?

స్వాతంత్ర్యం వచ్చినపుడు 1950 తొలినాళ్ళలోనూ భారతదేశంలో ఆరోగ్యం దిగనాసిల్లి వుంది. యిందుకు అనేక కారణాలు వుండవచ్చు కాని ముఖ్యమైంది రక్షితనీటి సరఫరా, పారిశుద్ధ్యం లేకపోవడం వాటిలో

ఒకటి స్వాతంత్ర్యం వచ్చిన నాటినుంచీ భిన్న పంచవర్ష ప్రణాళికల్ని (యికనుంచీ ప్రణాళికలు అని వ్యవహరించుకుందాం) అలా చూస్తే ఒక విషయం విశదమవుతుంది. అదేమిటీ అంటే ప్రజల సంక్షేమాన్ని పెంచడం లక్ష్యంలో ఈ రంగానికి దక్కవలసినంత ప్రాధాన్యం దక్కలేదు అని.[9]

మొదటి పంచవర్ష ప్రణాళిక (1951-56) లో తగినంత రక్షితనీరు అంశం మౌలిక అవసరంగా గుర్తింపు పొందింది. యావత్ దృష్టీ దాని మీదనే లగ్నం చెయ్యవలసి వచ్చేటంతటి అంశం అనీ భావించేరు. "రక్షిత నీటి సరఫరాకు ఇంగ్లండ్, అమెరికా దేశాలలో అవకాశం కల్పించిన సమయంలోనే యించుమించుగా భారతదేశంలోనూ కల్పించినా సాధించింది మాత్రం చెప్పుకోదగ్గట్టుగా లేదు. గట్టిగా 5 శాతం యిళ్ళకు కూడా గ్రామీణ ప్రాంతాల్లో మరుగుదొడ్లు లేవు. యిక పారిశ్రామికీకరణ, నగరీకరణ జరగడంతో, పారిశ్రామిక సముదాయాల నుంచి వెలువడే నానా కశ్మలంతోనూ, పట్టణాల నుంచీ వచ్చే మురికి వ్యర్థాలతోనూ నీటి కాలుష్యం జరిగింది. యిది గత కొద్ది సంవత్సరాలుగా ఒక సమస్య అయింది. భారతదేశంలో ప్రజల ఆరోగ్య సమస్యల్లో 80 శాతం నీటి సంబంధ వ్యాధులేనని నాల్గవ ప్రణాళికలో (1967-74) అంగీకరించడమూ జరిగింది.

వర్ధమాన దేశాల్లో ప్రజలకు తాగునీరు, ప్రాథమిక పారిశుద్ధ్యమూ అందించడం ప్రపంచంలో అనేక అందోళన కారక అంశం అయింది. దాంతో ఐక్యరాజ్యసమితి నీటి మహాసభ 1977లో మార్‌దెల్‌ప్లాతా (అర్జెంటినా)లో జరిగినప్పుడు పదేళ్ళ ప్రచారం నిర్వహించాలని సభ్య దేశాలకీ, అంతర్జాతీయ సంస్థలకీ పిలుపు యివ్వలసి వచ్చింది. యీ ప్రచారం సర్వ ప్రజా జీవితానికీ శుభ్రమైన నీరు, పారిశుద్ధ్యం అందుబాటులోకి వచ్చేటట్టు సాగాలి. యీ సమావేశంలో భారతదేశమూ పాల్గొంది. "ప్రజలందరికీ, -వాళ్ళ వాళ్ళ సామాజిక, ఆర్థిక స్థితిగతుల అభివృద్ధి దశయేదైనాగానీ, వాళ్ళవాళ్ళ మౌలిక అవసరాలకు తూగేటట్టు పరిమాణంలో గుణంలో తాగునీరు అందుబాటులోవుండే హక్కు వుంది" అని ఆ సమావేశం తీర్మానించింది. 1981-90 దశకాన్ని "అంతర్జాతీయ

తాగునీటి సరఫరా పారిశుద్ధ్య దశాబ్దం" గా ప్రకటించారు అంతర్జాతీయ దశాబ్దంలో యీ పథకం కింద కార్యాచరణకి భారతదేశం సంపూర్తి తోడ్పాటును ప్రకటించినప్పటికీ, మొత్తంమీద సాధించిన పురోగతి అంతంతమాత్రమే.

1987లో జాతీయ నీటి విధానాన్ని ప్రకటించారు. తాగునీటి సరఫరాకు యిందులో పెద్దపీట వేశారు. కాని అమలుకు వచ్చేటప్పటికి యేమంత మార్పు కనిపించలేదు. ఏడవ ప్రణాళిక (1985-90) వచ్చింది. "పట్టణ ప్రాంత పేదలవాడల్లో మరణాలు వ్యాధులూ యెక్కువగా వున్నాయి. దీనికి కారణం నాసిరకం నీరు, పారిశుద్ధ్య సౌకర్యాలూ అని చెప్పాలి" అని ఆ ప్రణాళిక గుర్తించింది. ఎనిమిదవ ప్రణాళిక (1992-97) దృష్టి మిగిలిన పట్టణ ప్రాంత ప్రజానీకానికి శుభ్రమైన తాగునీరు అందించేందుకు విస్తరించాలి అని. అలా అయితే శతాబ్దం ముగిసే నాటికి నూటికి నూరుశాతం జనాభాకి నీరు అందించినట్టు అవుతుంది. యిక గ్రామీణ ప్రాంతాల్లో ప్రణాళిక 'నిరాధార' తీవ్ర సమస్యాత్మక పల్లెలకి ముందుపీట వేసింది. తొమ్మిదవ ప్రణాళిక (1997-02) పత్రం ఈ సందర్భంలో ప్రభుత్వం ఉద్దేశాల్ని పునరుద్ఘాటించింది. ప్రభుత్వం "అయిదేళ్ళ కాలంలో దేశంలోని ప్రతి ఆవాసానికీ తాగునీరు అందించేందుకు కట్టుబడి వుంది" అని అది ప్రకటించింది. తొమ్మిదవ ప్రణాళికకు పరిసరాల, ఆరోగ్య ప్రణాళిక సంఘ ఉపబృందం వుంది. శుభ్రమైన తాగునీరు సరఫరా సంతృప్తికరంగా లేకపోవడం వల్లనూ, ఘన, ద్రవ వ్యర్థాలని తొలగించే పారిశుద్ధ్య వ్యవస్థ సరిగా లేకపోవడంవల్ల నీటివల్ల, అంటువ్యాధి కారక పరిస్థితివల్ల వచ్చే వ్యాధులు విషమంగా చాలా అధికంగా తలెత్తేయని యీ బృందం తీర్మానించింది. 2004 మార్చి నాటికి సకల ఆవాసాలకీ ముందుగా రూపొందించిన నియమావళి ప్రకారం నిలకడగా శుభ్రమైన నీటి సరఫరా చెయ్యాలని పదవ ప్రణాళిక ప్రకటించింది (2002-07).

పౌరులందరికీ తగినంత తాగునీరు అందించవలసివుందని యిన్ని పెద్దపెద్ద కబుర్లు చెప్పినా, ఆందోళనలు వెల్లడి చేసినా, స్వాతంత్ర్యం

వచ్చిన నాటినుంచీ (పట్టిక 1 చూడండి) ప్రణాళికా నిధుల కేటాయింపు పట్టణ నీటి, పారిశుద్ధ్య రంగానికి సంబంధించి 2 శాతం కూడా యెన్నడూ దాటలేదు. యీ కాలంలో పట్టణ జనాభా 61.6 మిలియన్ల నుంచి 7.86 మిలియన్లకి పెరిగింది. దేశ జనాభాలో 1951-2001 మధ్యలో 17.3 శాతంనుండి 27.8 శాతంకు పెరిగింది. నీరు రాష్ట్రప్రభుత్వానికి సంబంధించిన అంశమే. అయినా, కేంద్ర ప్రభుత్వం యీ కీలక రంగానికి యిచ్చిన తక్కువ ప్రాధాన్యం తగ్గ స్థాయిలో కేటాయింపులు జరపడంలోనే వెల్లడవుతుంది. అది కూడా పట్టణ జనాభా నాలుగింతలు పైబడి పెరిగిన నేపథ్యంలో.

ఇక సాంఘిక రంగ వ్యయాలు వున్నాయి. యిందులో మిగిలిన వాటితోబాటుగా విద్య, ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం, నీటి సరఫరా, పారిశుధ్యం లాంటివన్నీ ఉన్నాయి. యివి స్థూల జాతీయోత్పత్తిలోనూ మొత్తం ప్రజలకోసం చేసే వ్యయాలలోనూ భారతదేశంలో 1980లతో పోలిస్తే 1990లలో తక్కువగానే వున్నాయి. 1980లలో జాతీయాదాయం 5.37 శాతం, 1960లలో 6.13 శాతం పెరిగినా కూడా యిలా జరిగింది (హనుమంతరావు, మహేంద్ర దేవ్, 2003).[10] ఎల్లెడలా కనిపించే ఆకలి (తగినంత ఆహారం లేకపోవడం దీనికి అనుబంధంగా వుండాల్సిన శుభ్రమైననీరు వగైరాలు లేకపోవడం) పోషకాహారలోపం, సులభంగా ప్రజల్ని బలిగొంటున్నాయి. గమనించనితీరులో మట్టుపెడు తున్నాయి. లేమి, అణగారిపోవడం, లోటు లాంటివి దారుణంగా సంభ విస్తున్నాయి. ప్రపంచంలో పేదరిక దేశాల జనాభాలో యెక్కువ మందిని బలిచేస్తున్నాయి. (సేన్ 1990.)

భారతదేశంలో మరొక వాదన వున్నది. పట్టణ ప్రాంతాల్లో యే నీటి సరఫరా జరుగుతూవున్నాగానీ, సరైన రుసుం వసూళ్ళు చెయ్యడం లేదనేది. యిలా యెందుకు జరుగుతుందీ అంటే. సబ్సిడీ నీటి సరఫరా వల్ల లబ్ధిపొందేది ముఖ్యంగా మధ్యతరగతి, ఎక్కువ ఆదాయం వున్నవాళ్ళే కాబట్టి. భారతదేశంలో వున్న యితర నగరాలతో పోలిస్తే ఢిల్లీలో గృహనీటి ధర అతి తక్కువ అని ఒక అధ్యయనం వెల్లడి చేస్తోంది (అరోరా, 1999).

పట్టిక - 1

## పట్టణ నీటి సరఫరా, పారిశుద్ధ్యాల ప్రణాళిక వ్యయాలు (యుడబ్ల్యుఎస్ఎస్)

| ప్రణాళిక దశ | మొత్తం వ్యయం | యు.డబ్ల్యుఎస్. వ్యయం | మొత్తం వ్యయం లో శాతం | పట్టణ జనాభా (మిలియన్లలో) | పట్టణ జనాభా లో శాతం |
|---|---|---|---|---|---|
| మొదటి ప్రణాళిక (1951-56) | 33.59 | 0 43 | 1.28 | 61 6 | 17 3(1951) |
| రెండవ ప్రణాళిక (1956-61) | 67.69 | 0.44 | 0.65 | -- | -- |
| మూడవ ప్రణాళిక (1961-66) | 85.93 | 0.89 | 1.04 | 77.6 | 18.0(1961) |
| నాలుగవ ప్రణాళిక (69-74) | 159 32 | 2 82 | 1.77 | - | - |
| అయిదవ ప్రణాళిక (74-79) | 392 46 | 5.49 | 1.40 | 107.0 | 19.9(1971) |
| ఆరవ ప్రణాళిక (80-85) | 976.07 | 17.67 | 1.81 | 156.4 | 23.3(1981) |
| ఏడవ ప్రణాళిక (85-90) | 1797 42 | 29.66 | 1 65 | - | - |
| ఎనిమిదవ ప్రణాళిక (92-97) | 4334 84 | 59.82 | 1.38 | 212 9 | 25 7(1991) |
| తొమ్మిదవ ప్రణాళిక (97-2001) | 7800 00 | 117.00 | 1.50 | 285.4 | 27.8(2001) |

ఆధారం : ఒ.పి. మాథూర్ (2000), మరియు జనాభా లెక్కలు

గమనిక: ఆఖరి రెండు దిగువ వరసల్లోని అంకెలు అవే జనాభాగణన సంవత్సరాలవి. (కుండలీకరణం లోపు సంవత్సరం.

ఉన్నతవర్గాల వాళ్ళకీ, మధ్యతరగతి వాళ్ళకీ నీటి సరఫరా యెక్కువ సబ్సిడీతోచేసే అసమపంపిణీకి భారత రాజధాని మహత్తర ఉదాహరణ. భారతదేశంలో తక్కువ వినిమయ ఛార్జీలవల్ల నీటి ప్రాముఖ్యం తగ్గడం, వృధాకావడం యెక్కువగా వున్నాయి. వినిమయం పెరుగుతూ వుంటే అందుకు సమంగా ఛార్జీలు పెరగడం లేదు. చాలా రాష్ట్రాల్లో మినహాయింపు పరిమితుల్ని అధికారులు యే స్థాయిలో పెట్టారంటే పట్టణ ప్రాంత సంపన్నులు తాము వినిమయం చేసుకుంటూవున్న దాంట్లో గణనీయమైన భాగానికి చెల్లించడమే లేదు. యిక 'నీటి ఖరీదుల్ని వినిమయాన్ని క్రమబద్ధీకరించే సాధనంగా వర్తింపచెయ్యడమే లేదు. అలా చేసినట్లయితే మురికివాడలకి నీటి అందుబాటు పెరిగి వుండేది' (కుందు, 1992). ఆ రకంగా సబ్సిడీ రేట్లతో ప్రజా సేవల ద్వారా సరఫరా అయే నీటిని పట్టణ ప్రాంతాల్లో సంపన్న వర్గాల వాళ్ళు, మధ్యతరగతి వాళ్ళు అనుభవిస్తూ వుండే అధిక సంఖ్యలో వుంటే పేదవారికీ తక్కువ ఆదాయ వర్గాలవాళ్ళకీ నీటి సరఫరా తక్కువగానూ, అరకొరగానూ వుంటోంది.

## తాగునీటి అందుబాటు

నగరీకరణ జాతీయ కమీషన్ (NCU) యిలా తెలియజేసింది: 'అసలు సమస్యలు తలెత్తేది నీరు లేకపోవడం వల్ల కాదు, అసమపంపిణీ వల్ల, నీటి సరఫరావ్యవస్థ సమానంగా లేదు. అన్యాయపూరితంగా వుంది. సంపన్న వర్గాలవాళ్ళకే యెక్కువ మొగ్గు'. భారత నగరాలలో రోజుకు తలసరి 70 లీటర్లు కనాకష్టంగా అవసరం (ఎల్‌పిసిడి). వాంఛనీయ పరిమితి 90 ఎల్‌పిసిడి స్థాయి. (110-120 ఎల్‌పిసిడి అయితే మరింత మెరుగు.) యింతవుంటే కనీస ఆరోగ్య ప్రమాణాలతో జీవితం గడుస్తుంది.[11] పరమ అనావృష్టి పరిస్థితుల్లో, పరమ పేదరిక బస్తీల్లో కూడా కనీసం 70 ఎల్‌పిసిడి నీటి సరఫరా మనిషి మనుగడకు వుండాలని ఆ కమీషన్ గట్టిగా సిఫార్సు చేసింది. దీన్ని సాధించాలీ అంటే నీటి సరఫరా పంపిణీ వ్యవస్థను క్షాళన చెయ్యాలి. యే తీరులో అంటే అతిపేద బస్తీలకి కూడా క్రమం తప్పకుండా కనీస సరఫరా వుండేటట్లు చెయ్యాలి. సాధారణ వాతావరణ పరిస్థితుల్లో, సాధారణ కార్యకలాప

స్థాయిలో జీవనాధారానికి 50 ఎల్‌పిసిడి కనీసం అవసరం అని (గ్లీక్ 1999) అంచనా.

1988 సంవత్సరానికి జాతీయ శాంపిల్ సర్వే సంస్థ (NSSO) తాజాగా అందించిన గణాంకాల ప్రకారం పట్టణ ప్రాంతాల్లో 70 శాతం, గ్రామీణ గృహ సముదాయాల్లో 18.7 శాతం గృహాలకు కుళాయిల ద్వారా నీరు అందుతోంది (పట్టిక-2 చూడండి.) యిక యింటినుంచి ప్రధాన తాగునీటి వనరుకు మధ్యవున్న దూరం కూడా యిక్కడ ముఖ్యమైందే. ఏమంటే గృహసభ్యుల జీవన స్థాయిని అది సూచిస్తుంది. తాము నివసించే చోటుకు ముఖ్య నీటివనరు సమీపంలో వుందని గ్రామీణ ప్రాంతాల్లో 31 శాతం మంది, పట్టణ ప్రాంతంలో 66 శాతం మంది చెప్పారు. గ్రామీణ ప్రాంతాల్లో 60 శాతం మంది పట్టణ ప్రాంతంలో 32 శాతం మందీ తమ నీటి ఆధారం బయటనే వుందని చెప్పారు. అంటే సుమారుగా 0.2 కి.మీ.(NSSO, 1999).

1990లలో పట్టణ ప్రాంతాల్లో కుళాయిల ద్వారా రక్షిత మంచినీటి అందుబాటు తగ్గింది. అయితే గ్రామీణ ప్రాంతాల్లోనూ, పట్టణ ప్రాంతాల్లోనూ భూగర్భజలం మీద ప్రధాన వనరుగా ఆధారపడడం పెరిగింది. (గొట్టం బావులు, చేతి పంపులు). యివాళ గ్రామీణ ప్రాంతాల్లో సగం జనాభా భూగర్భజలంమీద ఆధారపడుతోంది. బహిరంగ బావులమీద ఆధారపడడటం కూడా (25.8 శాతం) హెచ్చుగానే ఉంది. భూగర్భ జలాలు కాలుష్యం వల్ల నాసిరకంగా తయారవుతున్నాయి. యిది భారతదేశంలో పెద్ద సమస్య అయింది. నీటి నాణ్యం సంబంధిత సమస్యలతో దాదాపు 44 మిలియన్ల మంది బాధపడుతున్నారు. ఫ్లోరైడ్, ఇనుం, నైట్రేట్, అర్సెనిక్, భారలోహాలు, లవణం యెక్కువ అవడం లాంటి వాటివల్ల (శివ, యితరులు 2002-2003)[12] జార్ఖండ్ రాష్ట్రం (అధిక భాగం బీహార్‌నుంచి వేర్పాటు చేసి యేర్పరచిందే) పలుమావు జిల్లా మనాతుబ్లాక్‌లో కుసుమాతండ్ అనేగ్రామంలో సంభవించిన ఆకలి చావుల గురించి పరిశీలించడానికి నిజనిర్ధారణ కమిటీ అక్కడికి వెళ్ళింది. గ్రామస్థులు పరమ కలుషిత నీటిని త్రాగుతున్నారని, ఆహారం, శుభ్రమైన నీరు లేకపోవడంతో దారుణమైన

పట్టిక - 2

భారతదేశంలో తాగునీరు, పారిశుద్ధ్యాల ప్రధాన ఆధారం ద్వారా గృహాల పంపిణీ శాతం: 1988-1998

| ఆధారం | గ్రామీణ | | | పట్టణ | | |
|---|---|---|---|---|---|---|
| | 1988 | 1993 | 1998 | 1988 | 1993 | 1998 |
| కుళాయి | 15.5 | 18.9 | 18.7 | 72.1 | 70.4 | 70.1 |
| గొట్టం బావి, చేతిపంపు | 39.1 | 44.5 | 50.1 | 17.2 | 18.5 | 21.3 |
| బావి | 39.1 | 31.7 | 25.8 | 9.2 | 8.6 | 6.7 |
| చెరువులు, కుంటలు వగైరా | 2.2 | 2.1 | 1.9 | 0.3 | 0.8 | 0.3 |
| నదులు, కాలువలు, సరస్సులు | 2.4 | 1.7 | 1.3 | 0.3 | 0.1 | 0.1 |
| ఊటలు | 1.4 | 0.9 | 1.7 | 0.2 | 0.1 | 0.1 |
| ఇతర ఆధారాలు | 0.6 | 0.3 | 0.4 | 0.8 | 1.4 | 1.1 |
| అన్నీ కలిపి | 100.0 | 100.0 | 100.0 | 100.0 | 100.0 | 100.0 |
| మరుగుదొడ్లు వాడనివి | 89.0 | 85.8 | 82.5 | 31.8 | 3.06 | 25.5 |

ఆధారం: ఎన్ఎస్ఎస్ఒ(1999)

గమనిక: **1988, 1993** అంచనాల ఆధారం ఎన్ఎస్ఎస్ఒ **44, 49** క్రమాలు.

జబ్బులబారిన పడడం, మరణాలు సంభవించడం జరుగుతోందని ఆ కమిటీ గమనించింది. మహేంద్రదేవ్ నుండి ఉల్లేఖించింది, 2003).

భారతదేశంలోని చాలా రాష్ట్రాల్లో గ్రామీణ గృహాలలో 10 శాతం కంటే తక్కువ మందికే కుళాయి నీరు అందుబాటులో వుంటోంది. వాళ్ళు భూగర్భజలంమీదే ఎక్కువగా ఆధారపడుతున్నారు (పట్టిక -3 చూడండి). పట్టణ ప్రాంతాల్లో యీ సౌకర్యం బీహార్, కేరళ, ఉత్తరప్రదేశ్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల్లో అఖిల భారత సగటు కంటే తక్కువే ఉంది. కొన్ని రాష్ట్రాల్లో పట్టణ ప్రాంతాల్లో భూగర్భజలం మీద ఆధారపడడమూ

పట్టిక - 3

భారతదేశంలోని ముఖ్య రాష్ట్రాల్లో తాగునీరు, పారిశుధ్య సౌకర్యాల ప్రధాన ఆధారంతోవున్న యిళ్ళ శాతం

| రాష్ట్రం | తాగునీటి ఆధారం | | | | మరుగుదొడ్లు లేని | |
|---|---|---|---|---|---|---|
| | గ్రామీణ | | పట్టణ | | గ్రామీణ | పట్టణ |
| | కుళాయి | గొట్టం బావి | కుళాయి | గొట్టం బావి | | |
| 1. ఆంధ్రప్రదేశ్ | 26.2 | 46.9 | 75.1 | 12.8 | 88.5 | 30.8 |
| 2. అస్సాం | 7.3 | 49.5 | 42.2 | 38.4 | 24.7 | 2.0 |
| 3. బీహార్ | 0.7 | 70.3 | 35.3 | 43.1 | 89.4 | 45.3 |
| 4. గుజరాత్ | 46.6 | 31.7 | 91 1 | 7.3 | 79.9 | 21.1 |
| 5. హర్యానా | 31.1 | 49.9 | 80.5 | 19.4 | 84.5 | 32.9 |
| 6. కర్ణాటక | 26.6 | 53.9 | 80.9 | 11.2 | 88.9 | 30.0 |
| 7. కేరళ | 10.6 | 1.4 | 40.2 | 3.5 | 23.1 | 5.1 |
| 8. మధ్యప్రదేశ్ | 5.0 | 52.2 | 76.1 | 13.1 | 94.5 | 45.2 |
| 9. మహారాష్ట్ర | 41.1 | 24.4 | 92.0 | 5.3 | 85.3 | 15.8 |
| 10. ఒరిస్సా | 2.9 | 53.2 | 38.7 | 32.3 | 96.1 | 35.8 |
| 11. పంజాబ్ | 14.8 | 82.7 | 64.4 | 35.5 | 67.9 | 14.8 |
| 12. రాజస్థాన్ | 19.2 | 36.2 | 85.4 | 10.4 | 87.0 | 25.5 |
| 13. తమిళనాడు | 50.0 | 31.1 | 74.0 | 18.7 | 88.5 | 32.5 |
| 14. ఉత్తరప్రదేశ్ | 8.8 | 63.5 | 43.2 | 53.2 | 90 6 | 28.2 |
| 15. ప.బెంగాల్ | 4.1 | 75.6 | 56.0 | 38.2 | 76.1 | 15.2 |
| భారత్ | 18.7 | 50.1 | 70.1 | 21.5 | 82.5 | 25.5 |

గమనిక: యీ పెద్ద రాష్ట్రాలు 15 లోనూ 90 శాతం మంది జనాభా వున్నారు. (2001 లెక్కల ప్రకారం). అంతర్ రాష్ట్ర విశ్లేషణల కోసం చాలామంది నిపుణులు వీటినే పరిగణిస్తారు. భారతదేశంలో మొత్తం 35 రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాలు వున్నాయి.

ఆధారం : ఎన్ఎస్ఎస్ఒ (1999) 40. ఎ-27 నుంచి ఎ-39 దాకా.

యెక్కువే కొన్ని రాష్ట్రాల్లోని గ్రామీణ ప్రాంతాల్లో మరుగుదొడ్ల సదుపాయం లేని యిళ్ళ శాతం దగ్గరదగ్గర 90 వుంది. మరుగుదొడ్ల సౌకర్యం లేని యిళ్ళు పట్టణ ప్రాంతాల్లో కొన్నిరాష్ట్రాల్లో 35-40 శాతం దాకా వున్నాయి. కుళాయి, గొట్టం బావి, అలాగే గ్రామీణ పట్టణ ప్రాంతాలు రెండింటిలోనూ మరుగుదొడ్లులేని వర్గీకరణల్లో సంఖ్య రీత్యా కేరళలో యెక్కువ ఉన్నాయి. విద్య, ఆరోగ్యం, సామాజికాభివృద్ధి సూచికల స్థాయికి సంబంధించి భారతదేశంలో కేరళదే అగ్రస్థానం. బహిరంగ బావులే తాగునీటికి ప్రధాన ఆధారంగా హెచ్చు శాతం అక్కడి యిళ్ళల్లో వుంది (పట్టణ ప్రాంతంలో 55.4 శాతం, గ్రామీణ ప్రాంతంలో 85.1 శాతం).

## మారుతున్న అభివృద్ధి నమూనా: నీటి ప్రైవేటీకరణ వైపు మార్పు

1990లు ఆర్థిక సరళీకరణ దశ. సబ్సిడీలలో మొత్తం కుదింపు అమలుపరిచే చర్యలు, పెట్టిన ఖర్చులు మొత్తం రాబట్టుకోవడం ప్రైవేటీకరణ చర్యలు ప్రపంచవ్యాప్తంగా వూపు అందుకున్నాయి. ఈ తర్కము నీటి రంగానికీ సోకింది. అనేక దేశాల్లో ప్రజారంగ నీటి సేవలు, మరింతగా ప్రైవేటుపరం కావడం జరిగింది. అసలీ ధోరణి 1970ల నాటికే అంకురించింది. అప్పట్లో పాశ్చాత్య దేశాల్లో ఉదారవాద (స్వేచ్ఛా మార్కెట్) విధానాల వేపు మొగ్గు, మళ్ళడం కనిపించేయి. నయా ఉదారవాద సిద్ధాంతమే చాటేదియేమిటంటే స్వేచ్ఛాయుత మార్కెట్‌లోనే ఆర్థిక సామాజిక అభివృద్ధి కార్యకలాపం సాగించవచ్చు. ప్రభుత్వం నేరుగా యిందులో తలదూర్చకుండా సౌకర్యాలు కలిగించడం, క్రమబద్ధీకరించడం పాత్ర పోషిస్తుందంతే. పాశ్యాత్య దేశాల ఆధిపత్యంలోవున్న ఆర్థిక వ్యవస్థలు (ముఖ్యంగా ప్రపంచ బ్యాంక్, అంతర్జాతీయ ద్రవ్యనిధి) యేక కాలంలోనే యీ కార్యక్రమాన్ని అనుసరించేయి. యీ సంస్థలు "తమ ఉత్తమర్ణ (creditor) పలుకుబడిని ఉపయోగించి అధమర్ణ (అప్పువడ్డీ debtor) తక్కువ, మధ్య ఆదాయల దేశాల ప్రభుత్వాలమీద నయా ఉదారవాద సంస్కరణల్ని గుక్క తిప్పుకోనీయకుండా రుద్దేయి" (బడ్స్, మాక్రానాన్, 2003 గుటెరిజ్ 2001నుంచి ఉల్లేఖన)

1992లో "నీరు పర్యావరణం" పై డబ్లిన్ కాన్ఫరెన్సు జరిగింది. అది

నీటి వనరుల నిర్వహణకు సంబంధించి కొత్త వైఖరిని ఆవిష్కరించింది. యిది వర్ధమాన దేశాల్లో నీటిరంగ ప్రైవేటీకరణను ప్రోత్సహించింది. నీటికి ఆర్థికవిలువ వుందనీ, అంచేత దీన్ని ఒక ఆర్థిక సరుకుగా చూడాలని అది ప్రకటించింది. అంతేకాదు నీరు పారిశుద్ధ్యం అందుబాటులో ఉండడం ప్రాథమిక మానవ హక్కులని, కానైతే భరించ గల ఖర్చులతోనే అనీ చాటింది. డబ్లిన్ ప్రకటన నాల్గవ సూత్రం యిలా చెప్తోంది.

నీరు బహుళ ప్రయోజనాలన్నిటివల్లా ఆర్థికవిలువ కలిగి ఉంది. ఒక ఆర్థిక సంపదగా గుర్తించి తీరాలి. యీ సూత్రాన్ని అనుసరించి సర్వమానవాళికీ స్థోమతవున్న వెలతోనే తాగునీరు పారిశుద్ధ్యమూ అందుబాటులో వుండి పొందవలసిన ప్రాథమిక హక్కుగా దీన్ని గుర్తించడం అవసరం. నీటికి వున్న ఆర్థిక విలువను గతంలో గుర్తించలేని వైఫల్యం వల్ల దుర్వ్యయం జరిగింది. పర్యావరణానికి చేటు కలిగించేటట్టు వినియోగించడం జరిగింది. సమర్థవంతంగా న్యాయమైనరీతిలో వినియోగం సాధించడానికి నీరు ఒక ఆర్థిక సంపదగా దీన్ని నిర్వహించడం ముఖ్యమైన వైఖరి అలాగే నీటి వనరులని కూడగట్టడానికీ, పరిరక్షించడానికీ యిలా గుర్తించాలి"(పెట్రెల్లా 2001).

ప్రపంచ బేంక్, అంతర్జాతీయ ద్రవ్యనిధి (IMF) రుణాలు యిచ్చే షరతులలో అనేక దేశాలకి నీటి రంగంపై నియంత్రణ తొలగించాలని పట్టుబట్టడం ప్రారంభించాయి. 2000 సంవత్సరంలో అంతర్జాతీయ ద్రవ్యసంస్థల ద్వారా ఐఎంఎఫ్ 40 రుణాలు యిప్పించింది. వీటిలో 12 పాక్షిక లేక సంపూర్ణ నీటి సరఫరా ప్రైవేటైజేషన్ అడిగినవే. పూర్తి వ్యయం తిరిగి రాబట్టాలని చెప్పినవే. సబ్సిడీలు తొలగించాలని చెప్పినవే (శివ 2002). 2001లో నీటికీ పారిశుద్ధ్యానికీ సంబంధించి ప్రపంచ బేంక్ యిచ్చిన రుణాలలో 40 శాతం పైగా నీటి వినియోగ ప్రైవేటైజేషన్ షరతుగా వున్నవే. (ఐఎస్ ఒడిఇసి, 2002). యీ రంగంలో 2000–2004 మధ్య ప్రపంచ బేంక్ రుణాల్ని క్షుణ్ణంగా పరిశీలించండి. రుణ మొత్తాల్లో అధికభాగం ప్రైవేటైజేషన్‌కీ వ్యయం రాబట్టుకోవడానికీ సంబంధించినవే అని తేటతెల్లమవుతుంది (గ్రూస్కీ, ఫిల్ ఫ్లిన్, 2004).

1991 నుండి సరళీకరణ విధానాలని అనుసరించి ఎనిమిదవ ప్రణాళిక (1992-97) గణనీయంగా గత విధానాలనుంచి మళ్ళింది. నీటి రంగాన్ని ప్రైవేటీకరించడం వైపు తలవూపింది. మిగిలిన అంశాలతో బాటుగా ముఖ్యమైన వ్యూహాలు యేమిటంటే, యితర వనరుల మాదిరిగానే అదే తీరులో ఖచ్చితంగా నీటినీ ఒక సరకుగా నిర్వహించడం తాగునీటి ప్రాజెక్టుల నిర్మాణ, నిర్వహణలకి సంబంధించి ప్రైవేటురంగాన్ని ప్రోత్సహించడం సాధ్యమైనంత యెక్కువగా వాటిని సమీకరించడం. పట్టణ ప్రాంతాల్లో తాగునీటికీ, పారిశుద్ధ్యానికీ సముచితమైన యూజర్ చార్జీలని స్వేచ్ఛగా మునిసిపాలిటీలు విధించుకోవడం. ఆ రకంగా తమ ఆర్థిక పరిస్థితి పటిష్ఠం చేసుకోవడం. పదవ ప్రణాళిక అయితే నీటి రంగంలో సరళీకరణ దృక్పధాన్ని (2002 -07) మరింత నొక్కి చెప్పింది:

మరే యితర వనరులాగానే నీటినీ వూరికే దక్కే సరుకు కంటే ఆర్థిక సొత్తుగా నిర్వహించవలసిన అవసరం ఉంది. వాడకందార్లకి నీటి సరఫరా, ఒక సూత్రం మీద ఆధారపడి జరగాలి. అదేమిటంటే ఉపయుక్త మైన డిమాండ్. యిది అందించే సేవల ప్రమాణాలకి అనురూపంగా వుండాలి. వాడకందార్లు ఒక సమూహంగా నిర్వహణ, అజమాయిషీ జరిపిం చేందుకు సొమ్ము పెట్టేందుకు సిద్ధంగా ఉండాలి.

అయితే భరించగలిగే స్తోమతలేని పేదవాళ్ళకి ప్రత్యేక అవకాశాల్ని కలిగించాలనీ పదవ ప్రణాళిక చేస్తోంది. ఆ రకంగా ఎనిమిదవ ప్రణాళిక నుంచీ నీటిని, మరే యితర సరుకులాగానే ఒక ఆర్థిక సరకుగా ప్లానింగ్ కమీషన్ పత్రాల్లో పరిగణించడం జరిగింది.

భారత ప్రభుత్వ ఆర్థిక శాఖ మౌలిక సదుపాయాల వ్యాపారీకరణకి సంబంధించి ఒక నిపుణుల కమిటీని యేర్పాటు చేసింది. మౌలిక సదుపాయాల ప్రాజెక్టులు నిర్వహణకు యీ కమిటీ కొన్ని చర్యలు సిఫార్సు చేసింది. యిందులో పట్టణ ప్రాంత నీటి సరఫరా, పారిశుద్ధ్యమూ కూడా వున్నాయి. వీటిని వ్యాపార ఫక్కీలో నిర్వహించాలని, అది ప్రైవేట్ వక్తులుగాని, ప్రభుత్వ - ప్రైవేటు భాగస్వామ్యంగాని అలా నిర్వహించాలని సూచించింది. (GOI, 1996) వ్యాపారీకరణ తీరుతెన్నుల్ని యిలా వివరించడం జరిగింది:

"వ్యాపార దృక్పథంలో డిమాండ్ దిశ" వుంటుంది. సేవల్ని ఆ ఫలానా డిమాండ్ వస్తుందన్న ఊహతోగాక డిమాండ్‌నుబట్టి సేవలు వుండాలి. దీనివల్ల అలాంటి ప్రాజెక్టులు ఆర్థికంగా తిరిగి రాబట్టు కోవడం, మన గలగడం మెరుగవుతాయి. మౌలిక సదుపాయాల ప్రాజెక్టుల వ్యాపారీకరణ అంటే అసలు అర్థం "వ్యయం - తిరిగి రాబట్టుకోవడం ఆధారంగా వినిమయదారులకు సంతృప్తికలిగే విధంగా సమర్థవంతమైన సేవల్ని అందించడం నీటి పన్నును వ్యయం - రాబట్టు కోవడం స్థాయి అందుకునేటట్టు క్రమేపీ పెంచాలి. అవసరమైన పెంపుదలలో కొంత భాగాన్ని కనెక్షన్ ఛార్జీల్లాగా వసూలు చెయ్యవచ్చు. నీటి సరఫరా మీటరింగ్‌ని ప్రోత్సహించాలి. వ్యాపారీకరణ సామర్థ్యం చెల్లించే వాళ్ళనీ, చెల్లించలేని వాళ్ళనీ వేర్పాటుచేసే సామర్థ్యంమీదా ఆధారపడి వుంటుంది. ఉచితంగా లాక్కుపోయే సంఘటనల్ని నిరోధిస్తుంది. మినహాయించడం అమలుచేసే పరిధి (అంటే వినియోగదారుడు ఆ సేవను వినియోగించ కుండా అడ్డుపడడం) వ్యాపారీకరణకు అనుకూలమైన అంశాలలో కీలకం.[13]

నీటి రంగంలో మారుతున్న నమూనాని భారత ప్రభుత్వ జాతీయ నీటి విధానం (2002) ప్రతిఫలింపచేస్తోంది. "నీటి వనరుల ప్రణాళికలో అభివృద్ధిలో నిర్వహణలో ప్రైవేటురంగ భాగస్వామ్యాన్ని ప్రోత్సహించడం" యిందులో వుంది.

లాటిన్ అమెరికాలో సరళీకృత విధానాలు అవలంబించిన అనుభవం వుంది. సేవల నాణ్యత తగ్గడంతోబాటు నీటి ధరలూ గణనీయంగా పెరిగేయని ఆ అనుభవం తెలియజేస్తోంది. నగరాల్లో 40 మిలియన్ల పేద ప్రజలకి శుభ్రమైన నీరు అందుబాటులో లేదు. యెందుకనీ అంటే "కనెక్షన్ ఖరీదును వాళ్ళు భరించలేరు లేదా డబ్బు కట్టకపోవడంవల్ల వాళ్ళ కనెక్షన్‌ని తొలగించడం జరిగింది" (ఆంటన్, 1993). ఘనా దేశానికి ప్రపంచ బేంక్ అప్పులిచ్చింది. అందుకు విధించిన షరతుల పుణ్యమా అని 2001 మే నెలనాటికి నీటి పన్నులు 95 శాతం పెరిగేయి. పేదవాళ్ళకైతే కుళాయి నీటి భాగ్యం యెలాగూలేదు. పాపం వాళ్ళు రోజుకు మూడు బాల్చీలు

నీళ్ళు కొనుక్కుంటే వాళ్ళ రోజువారీ సగటు ఆదాయంలో 10-20 శాతం దీనికి సమర్పించుకోవాలి. ప్రైవేట్ భాగస్వామ్యం కోసం తయారు చేసిన పత్రంలో ఆర్థిక కొలమానానికి 60 శాతం ప్రాముఖ్యం యిస్తే ప్రజారోగ్యానికి 10 శాతం మాత్రమే దక్కింది. యిక పేదరికానికైతే మొండిచెయ్యి (NSODEC, 2002). ప్రజారోగ్యంలో ప్రతికూల పరిస్థితులు, తిరగ బెట్టిన విరేచనాలు, నీటి దారిద్ర్యం పెరగడం వగైరాల్లాంటివి యునైటెడ్ కింగ్‌డమ్‌లో జరిగాయి. ప్రజా సంస్థలు, మునిసిపాలిటీలు నీటి కంపెనీలకు వ్యతిరేకంగా నిరసనలు అందుకునేటట్లు చేశాయి. ఆ కంపెనీల కార్యకలాపాలే "పేదవాళ్ళని తీవ్రంగా బాధించేయి (బేక్కర్, 2001)

పట్టుగా వుండే నియంత్రణ లేనట్లయితే నీటి ప్రైవేటీకరణ, అసలు సరఫరా వ్యవస్థ మూలంనుంచే కనెక్షన్ తీసుకోగలశక్తి వున్నవాళ్ళకే లాభం కలిగిస్తుంది. పట్టణ ప్రాంత పేదలు మళ్ళీ ఉపేక్షకు గురవుతారు కాల్బర్ యేటన్ 1999). ప్రతి మనిషికీ నీటి హక్కు వుందన్న అంశం వెనక పంక్తిలోకి పోతుంది. ప్రాముఖ్యంలో తగ్గిపోతుంది. భవిష్యత్‌ని నీళ్ళ కంపెనీలకి, లాభం పోటీ అన్న వాళ్ళ తర్కానికీ వదిలిపెట్టేస్తే తల యెత్తేది యీ పరిస్థితే (పెట్రెల్లా, 2001). బొలీవియాలోని కోచబంబా ప్రజలు నీటి ప్రైవేటీకరణకు వ్యతిరేకంగా నిర్వహించిన సాహసోపేత పోరాటం యావత్ ప్రపంచానికీ తెలుసు.

## సీసా నీళ్ళ వ్యాపారం

భారతదేశంలో ఆఘమేఘాల మీద పెరుగుతూవున్న వ్యాపార రంగాల్లో సీసా లేదా పాకేజ్డ్ నీళ్ళ వ్యాపారం ఒకటి. బోలెడు భారతీయ, బహుళజాతి కార్పోరేషన్లు యీ నీటిరంగంలో భారీ యెత్తున ప్రవేశించాయి. అమెరికన్ డాలర్లలో యీ మార్కెట్ 104 నుంచి 145 మిలియన్లు వుంటుంది. 1992 - 2000ల మధ్యకాలంలో అమ్మకాలు 90 నుండి 935 మిలియన్ల లీటర్లకీ పెరిగేయి. యీ రంగంలో పెరుగుదల రేటు సాలుకు 30-70 శాతం స్థాయిలో వుంది. యీ మార్కెట్ పెరుగుదల యెలా వచ్చిందయ్యా అంటే పౌరులకు శుభ్రమైన తాగునీరు అందించడంలో ప్రభుత్వాలు విఫలం కావడం వల్ల, వాతావరణ కాలుష్యం

దృష్ట్యా శుభ్రమైన నీటికోసం డిమాండ్ పెరగడం వల్ల, యీ పరిశ్రమలో 180మందికి పైగా వున్నారు. వీళ్ళు ప్రతియేడు 1000 మిలియన్ల లీటర్ల నీటిని మార్కెట్లో అమ్ముతున్నారు (శివ 2002, శర్మ 2002. డౌన్ టు ఎర్త్ 15 మార్చి, 2003 www.corpwatch.india org) అధికారిక సమావేశాల్లో మునిసిపాలిటీ[14] నీటికి బదులుగా సీసా నీళ్ళనే ప్రభుత్వ సంస్థలూ ప్రోత్సహిస్తున్నాయి. ప్రభుత్వ అంచనాల ప్రకారం మార్చి, 2001 నాటికి సాలీనా 6540 మిలియన్ల శీతల పానీయాల బాటిల్స్ అమ్ముడుపోయేయి. అంటే 100 కోట్ల భారత జనాభాలో తలసరి 6 సీసాలన్నమాట. ఢిల్లీలో యీ వినిమయం తలసరి 50 బాటిల్స్ అని అంచనా. యిక యిపుడు కంపెనీలు గ్రామీణ మార్కెట్లను ఆకర్షించే ప్రయత్నంలో వుండడంతో భారతదేశంలో "వలసీకరణ (Colanization) జరగబోతోంది" (డౌన్ టు ఎర్త్,15 ఆగస్టు, 2003)[15]

సీసా నీళ్ళ, శీతల పానీయాల రంగంలో పేరు గడించిన మహనీయులు అందించే తక్కువ నాణ్యం, హీన ప్రమాణాలు యిటీవలి కాలంలో దేశంలో బట్టబయలు అయేయి. యీ కంపెనీలు ప్రముఖులచేత (ముఖ్యంగా క్రీడారంగం నుంచి వచ్చినవాళ్ళు, సినిమా తారలు) ప్రకటనలూ, ప్రచార ఆర్భాటాలూ కూడా నిర్వహిస్తూ వుంటాయి. అయినా ప్రజల ఆరోగ్య ప్రమాణాల గురించి ఆవగింజంత అయినా పట్టింపులేదు. స్థానికంగా ఆయా ప్రాంతాలనుంచి అనేకమంది చిన్నా చితకా ప్రబుద్ధులు యీరంగంలోకి ప్రవేశించారు. ఢిల్లీలో వున్న సెంటర్ ఫర్ సైన్స్ అండ్ ఎన్విరాన్‌మెంట్ (CSE) సంస్థ యెన్నో పరీక్షలు జరిపి వెల్లడించిన అంశాలు జనాల తలలు తిరిగిపోయేటట్లు చేశాయి. అనేక బ్రాండ్ల బాటిల్ నీళ్ళలో ఆరోగ్యానికి ముప్పు తెచ్చిపెట్టే పురుగుమందుల అవశేషాలు వున్నాయని ఆ సంస్థ వెల్లడించింది. సిఎస్ఇ 17 వేర్వేరు బ్రాండ్ల సీసా నీళ్ళ నుంచి 34 శాంపిల్స్ సేకరించి లేబొరేటరీలో పరీక్షించింది. దేశ రాజధాని ఢిల్లీలో మామూలుగా అమ్మకంలోవున్న నీళ్ళ సీసాలే అవి. యీ శాంపిల్స్‌లో అయిదు బడా కంపెనీలు వున్నాయి (బిస్లెరి, బెయిలీ, ప్యూర్ లైఫ్, ఆక్వాఫినా, కిన్లే వీటిలో చివరి మూడు బ్రాండ్లనే నెస్లె, పెప్సీ, కోకోకోలా కంపెనీలు విడుదల చేస్తున్నాయి).

ఆరోగ్యానికి గొడ్డలిపెట్టులాంటి పురుగు మందుల అవశేషాలూ, దిగుమతి చేసుకున్న ఎవియన్‌బ్రాండ్ ఒక్క దాంట్లో తప్ప, మిగిలిన అన్నిట్లోనూ కనిపించేయి. యూరోపియన్ ఎకనామిక్ కమీషన్ (EEC) నిర్దేశించిన ప్రమాణస్థాయికంటే 36.4 రెట్లు అధికంగా పురుగు మందుల అవశేషాలు కనిపించేయి. ఆరోగ్యానికి పూచీపడే సీసా నీళ్ళకోసం సొమ్ము చెల్లించడానికి పౌరుడు సిద్ధంగానే వున్నాడు. అయితేనేం గాక నీటి "పరిశ్రమ అతన్ని/ ఆమెని దగాచేస్తోంది", "నియంత్రణాధికారులు పౌరుణ్ణి పక్కన పెట్టేశారు" (డౌన్ టు ఎర్త్, 15, ఫిబ్రవరి 2003).

2003 ఆగస్టులో (CSE) వెల్లడించిన పరిశీలనలో శీతల పానీయాలు తాగే మధ్యతరగతి వర్గాలు ఖంగుతిన్నాయి. పెప్సీకో బ్రాండ్లలో మొత్తం పురుగు మందులు 36 రెట్లు అధికంగానూ, కోకాకోలా బ్రాండ్ శీతల పానీయాల్లో 30 రెట్లు అధికంగానూ వున్నాయని ఆ పరిశీలన వెల్లడి చేసింది. యీ అధిక ప్రమాణం ఇఇసి పరిమితులతో తులనాత్మకంగా చూసినపుడు వెల్లడైంది. సీసా నీళ్ళ గురించి యీ సంస్థ అంతకుముందే శోధించి వెల్లడించిందన్న విషయం తెలిసిందే. యీ బహుళజాతి సంస్థలు మనిషన్నవాడు తీసుకోలేని ఉత్పత్తుల్ని మార్కెట్లో పెడుతున్నాయి (డౌన్ టు ఎర్త్, 15 ఆగస్టు 2003).[16]

## కార్పొరేట్ సంస్థల లాభాల కోసం: ప్రజల నీళ్ళు

సీసా నీళ్ళ వ్యాపారం ప్రైవేటురంగంలో సాగుతుంది. అయితేనేం ప్రభుత్వం అసలు నీటిని వాటికి సరఫరా చేస్తోంది. దానికి ఒప్పందాలేవో వున్నాయి. ప్రైవేటు కంపెనీలు భారీ పరిమాణంలో భూగర్భజలాల్ని తోడుకోవచ్చు. కొన్ని నదులనీ, రిజర్వాయర్లనీ ఫలానా భాగం మేర కౌలుకు యివ్వవచ్చు. అదీ యిదీ గాకపోతే మునిసిపాలిటీ నీటినే యెకాయెకీ సరఫరా చెయ్యొచ్చు. కొన్ని సందర్భాల్లో యీ ఒప్పందాలు ఏక కాలంలో ఒకటికి పైబడే అమలులో వుండవచ్చు. ప్రపంచ నీటి వ్యాపారంలో గుత్తాధిపత్యం వున్న బహుళజాతి సంస్థలతో ఒప్పందాలు కుదుర్చుకునేందుకు భారతదేశంలో యిటీవల ప్రయత్నాలు సాగేయి. అనేక రాష్ట్ర ప్రభుత్వాలు అంతర్జాతీయ సంస్థలనుంచి భారీ

మొత్తంలో అప్పులు తెస్తూ నీటి ప్రాజెక్టులనీ, పారిశుద్ధ్య ప్రాజెక్టులనీ తలపెడుతున్నాయి. కేరళలోని పలక్కాడ జిల్లాలోని ప్లాచిమండ గ్రామంలోని కోకోకోలా ఫ్యాక్టరీ భూగర్భజలాల్ని తోడుకో రాదనీ, నీటి వనరులకోసం ప్రత్యామ్నాయాలు చూసుకోవాలనీ 2003, డిసెంబరు16న కేరళ హైకోర్టు ఆదేశించింది. భూగర్భజలాలు ప్రజలకు చెందినవనీ, భారీ ప్రమాణంలో దాన్ని తోడుకోనిచ్చే అధికారం ప్రభుత్వానికి లేదనీ కోర్టు ప్రకటించింది.[17]

నీటి రంగానికి సంబంధించి యీ తీర్పుకు చాలా ముఖ్యమైన అంశాలు వున్నాయి. చాలా రాష్ట్రాల్లో యెన్నో ప్రైవేటు సీసా నీళ్ళ కంపెనీలు భారీ ప్రమాణంలో భూగర్భ జలాల్ని తోడుకుంటున్నాయి. భూగర్భ జలాల్ని యిలా దారుణంగా దోచుకోవడాన్ని ప్రతిఘటిస్తూ స్థానికంగా ఉద్యమాలు తీవ్రతరం అవుతూ వున్నప్పుడు యీ తీర్పు బాధితులకి పెద్ద ఆసరా. బాధితులు తమ పోరాటాన్ని కోర్టులకు తీసుకు వెళ్ళవచ్చున్న సూచన దీన్ని బట్టి అందుతుంది.

భారతదేశంలో నీటి ప్రైవేటీకరణ దారుణంగా పరిణమిస్తోంది. నదులలో ఫలానా ఫలానా వరకువున్న భాగాన్ని ప్రైవేట్ సంస్థలకి (అవి భారతీయం కావచ్చు, బహుళజాతివీ కావచ్చు) కౌలుకు యివ్వడం యిటీవలి కాలంలో జరుగుతోంది.[18] యిలాంటి నదుల్లో చత్తీస్‌ఘడ్‌లోని శియోనాథ్, తమిళనాడులోని భవాని వున్నాయి. ఉత్తరప్రదేశ్‌లోని అప్పర్ గంగా కాలువ నీరు వగైరాలు ఉన్నాయి. శియోనాథ్ నదికి చెందిన 22.6 కిలోమీటర్ల భాగాన్ని రేడియస్ వాటర్ లిమిటెడ్ అనే ప్రైవేట్ కంపెనీకి 22 సంవత్సరాలు కౌలుకు యిచ్చేసారు. అది ఆ నదిమీద ఆనకట్ట కట్టుకుని నీటిని వాడుకోవచ్చు. 13 గ్రామాల్లో వున్న స్థానిక రైతులు ఆ నదికి ఒక కిలోమీటరు పరిధిలో బోరుబావులు వేసుకోవడం నిషిద్ధం. గ్రామస్థులు యెప్పటినుంచో అక్కడ చేపలు పట్టుకుంటూ వున్నారు. అదీ నిషిద్ధం. యిక పశువులూ శియోనాథ్ నదిలోకి వెళ్ళడానికి లేదు. ఇక భవాని నది. యిది కావేరీ నదికి ఉపనది. తమిళనాడులో నీటి కొరత, విస్తృతంగా వర్షాభావ పరిస్థితులూ వున్నాగానీ కోకాకోలా కంపెనీకి నిత్యం 1,00,000 లీటర్ల నీటిని భవానీ నది నుంచి సరఫరా

చేస్తున్నారు (శివ, యితరులు 2002). మహారాష్ట్రలోని వైతరిణి నది చెక్‌డామ్ దిగువన అనేక గ్రామాలున్నాయి. యివన్నీ తాగునీరు, సాగునీరు కొరతవల్ల బాధపడడం మొదలైంది. యెప్పుడు? ఆ రిజర్వాయర్ నుంచి రోజూ కోకాకోలా కంపెనీ 3,00,000 లీటర్ల నీటిని తీసుకునేందుకు అనుమతి పొందినప్పటి నుంచి. అప్పటిదాకా ఆ గ్రామస్థులకి నీటి సమస్య వుండేదికాదు (ఐద్వా తేదీలేదు). నీటి ప్రైవేటీకరణ గురించి దాతలకీ, ప్రభుత్వాలకీ మధ్య సాగే కీలక నిర్ణయాల్ని తెరవెనకచాటునే జరిగిపోతాయి. ప్రజల దృష్టికి రానేరావు. దాతలు గాని గ్రహీతలైన ప్రభుత్వాలుగాని ఆ రుణ ఒప్పందం యేమిటో, షరతులేమిటో పైకి చెప్పవు. యిది రియో ప్రకటన 10 సూత్రానికి విరుద్ధం. దాని ప్రకారం ప్రతివాళ్ళకీ సమాచారం, న్యాయ కార్యకలాపాలు అందుబాటులో వుండాలి. అదేవిధంగా నిర్ణయాలు తీసుకోవడంలో నిమగ్నమయే అవకాశమూ వుండాలి (శర్మ, 2002).

నీటి ప్రైవేటీకరణ పెరుగుతూ వుండడంతో, లాభాలు దండుకోవడం పెట్టిన పెట్టుబడిమీద భద్రంగా రాబడి చూసుకోవడమూ ముఖ్యం అయ్యేయి. నీరు అవసరం అయినవాళ్ళ అవసరాల్ని తీర్చడమూ, మానవ అవసరాలు తీర్చడమూ చోదకశక్తిగా పనిచేయడం మానేశాయి (APPEN, 1998). పెద్ద నీటి కంపెనీలు తృతీయ ప్రపంచంలో మదుపులు పెట్టడానికి మీనమేషాలు లెక్కపెడుతున్నట్టు తెలుస్తోంది. యేమంటే రాబడి శాతం తగినంతగా వుండడం లేదని నిర్వాహకులు అనుకుంటున్నారు. నీటి రంగంలో పెట్టిన మొత్తం ఖర్చును రాబట్టుకోవడం సాధ్యపడడం లేదు, సేవలకిగాను పేదలు చెల్లించేస్థితిలో లేరు. తప్పనిసరి పర్యవసానం సామాజిక ప్రతిఘటనలు, బహుళజాతి సంస్థల ఉపసంహరణ (రాబిన్స్, 2003).

## హైదరాబాద్ : నీటి ధర సంపన్నులకే అనుకూలం

హైదరాబాద్ ఆంధ్రప్రదేశ్ రాజధాని. 6 మిలియన్ల జనాభా వుంటుంది. భారతదేశంలోని సాఫ్ట్‌వేర్ కేంద్రాల్లో ఒకటిగా ముందుకు వస్తోంది. యీ సగం జనాభాలో 25 శాతం మురికివాడల్లోనే నివశిస్తున్నారు. కొన్ని

యేళ్ళుగా యీ నగరం నీటి యెద్దడిని యెదుర్కొంటోంది. కుళాయి నీళ్ళు రోజు విడిచి రోజు రెండు గంటలకే పరిమితం అవుతున్నాయి. పాతబస్తీలోని చాలా ప్రాంతాల్లో కలుషిత నీరు తుప్పుపట్టిన కుళాయిల ద్వారా (గొట్టాలు చాలా పాతవి, కొత్తవాటిని అమర్చవలసి వుంది) సరఫరా అవుతోంది. అలాంటి అనేక ప్రాంతాల్లో, మురికివాడల్లో 2003 జనవరి – నవంబరు మధ్య 45 మంది చనిపోయారు. వేలాదిమంది ఫీవర్ హాస్పిటల్‌లో చికిత్స పొందేరు. వీళ్ళ జబ్బులన్నీ కలుషిత నీటివల్లా, అధ్వాన్న పారిశుధ్య పరిస్థితులవల్ల వచ్చినవే.[19] హాస్పిటళ్ళలో చేరినవాళ్ళ సంఖ్య, చనిపోయిన వారి సంఖ్య 2002తో పోలిస్తే యిదేకాలంలో రెండింతలు అయింది. నీలోఫర్ హాస్పిటల్‌లో (పిల్లల హాస్పిటల్) 2003 మే – అక్టోబరు మాసాల్లో 10,500 మంది రెండు వ్యాధులకే చికిత్స పొందితే – తీవ్రమైన అతిసారం, టైఫాయిడ్ – వీళ్ళలో 22 మంది మృతిచెందేరు.[20]

పరిస్థితి యిలా వుంటే హైదరాబాద్ మెట్రోపాలిటన్ వాటర్ సప్లై అండ్ సీవరేజ్ బోర్డు (HMWSSB) కోకాకోలాకి పదిలక్షల పరిశుద్ధ నీటిని రోజూ కిలోలీటరు 25 రూపాయలకే (అంటే లీటరుకు 2.5 పైసలు!) అమ్ముతుంది. 2001వ సంవత్సరం ఆగస్టు నెలలో కోకాకోలాకి అమ్మే నీరు రోజుకు 2,00,000 లీటర్లు వుంటే అది క్రమేణా రోజుకు పదిలక్షల లీటర్లకి పెరిగింది. అంతేకాదు, 2003 మే–జూన్ మాసాల్లో, ప్రజలు కనీవినీ యెరుగని నీటి కొరతను యెదుర్కొంటూ వుంటే, టేంకర్‌కి 500 నుంచి 600 రూపాయల వరకు చెల్లిస్తూ వుంటే (అంటే శుద్ధి చేయని బోర్ బావి నీళ్ళు కిలోలీటర్‌కి 100–200 రూపాయలదాకా) కోకాకోలా వారికి మరింత అధికంగా నీటి సరఫరా చెయ్యడమూ జరిగింది

(ఈనాడు దినపత్రిక, ఆగస్టు 2003, హైదరాబాద్).

హెచ్ఎమ్‌డబ్ల్యుఎస్ఎస్‌బి నిర్ధారించిన నీటి రుసుం కిలోలీటరుకు 25 రూపాయలు. అది కోకాకోలా లాంటి వ్యాపారసంస్థ కానీయండి, ఫైవ్ స్టార్ హోటెళ్ళు కానివ్వండి, పరిశ్రమలు వగైరా కానీయండి. జనరల్ హాస్పిటళ్ళకీ (పేద, బడుగు వర్గాల ప్రజలకి చికిత్సచేసే హాస్పిటళ్ళు) విద్యాసంస్థలకీ కూడా యిదే రుసుం. యీ పద్ధతిలో ప్రజా సంస్థలకు

నీటి ఛార్జీలు చాలా యెక్కువగా వుంటాయి. యీ సంస్థలు ప్రజా సంక్షేమం కోసం కృషిచేస్తాయి. మరి యిదే సమయంలో వ్యాపారసంస్థలకి నీరు కారుచౌకగా లభ్యమవుతుంది. వాణిజ్య సంస్థల్ని, ప్రజా సంస్థల్ని నీటి రుసుం విషయంలో ఒకేగాటన కట్టడంలో ఒక చిత్రం వుంది. నీటి సరఫరా బోర్డు ఆర్థిక పరిస్థితి గడ్డుగా వుందో అని ఒక పక్క అంటూనే సంపన్న వర్గాలకి అనుకూలంగావుండే నీటి రుసుంను నిర్ధారించడం యిదే. వ్యాపారసంస్థల్లోకూడా నీటితో వ్యాపారం చేసుకునే సంస్థలనీ (సీసా నీళ్ళు, శీతల పానీయాలూ) ఏర్పాటు చేసి చూడాలి. వాటి నుంచి యెక్కువ మొత్తాలు రాబట్టాలి. యేమంటే వాళ్ళ ముడిసరకు నీళ్ళే కాబట్టి. యిలాంటి విధానం వల్ల సంభవించే పరిస్థితి యేమిటంటే తాగునీటి సమస్య తీవ్రంగా వుంటే కూడా (2003లో హైదరాబాద్‌లో మాదిరి) యీ వ్యాపార సంస్థలు అధికంగా నీటిని పొందడం. నీటి సరఫరా శాఖ దాన్నొక ఆదాయవనరుగా చూడడం. యీ ఆర్థిక తర్కం ద్వారా అయితే, ప్రజా హాస్పిటల్ యేదైనా యెక్కువ చెల్లించలేనట్లయితే (నీటి అవసరం యెంతగానో వున్నప్పటికీ కూడా) దానికి నీరు అందదు.21

బహుళజాతి సంస్థలని హైదరాబాద్ ఆకర్షించాలన్న పేరుతో నీటి రుసుంను ఒక ప్రోద్బలకంగా వాడుతున్నారు. ఇండియన్ స్కూల్ ఆఫ్ బిజినెస్ (ISB) కిలో లీటరుకు 4 రూ.ల చొప్పున రోజుకు 200-500 కిలోలీటర్లదాకా రోజూ నీటిని తీసుకుంటోంది. అదే మామూలు పౌరుడు అయితే కిలోలీటరుకు 6 రూపాయలు చెల్లించాలి. అంటే కార్పొరేట్ రంగానికి చెందిన ఐఎస్‌బి సామన్య పౌరుడికంటే చవకగా నీరు పొందుతున్నదన్న మాట. యిక అది తీసుకునే నీటి పరిమాణం తక్కువ సంఖ్య ప్రజలు (వెయ్యికంటే తక్కువ) అదే ప్రాంగణంలో వుంటూ వున్న వాళ్ళు తీసుకునే నీటి పరిమాణం కంటే యెక్కువే.

## ముగింపు

భారతదేశంలో పేదవాళ్ళకి తగినంత నీరు అందుబాటులో లేక పోవడం (లేక లేదనడం) ఆర్థిక సంస్కరణలు అడుగుపెట్టకముందే యేనాటినుంచో జరుగుతూ వుంది. తడవతడవకీ సుప్రీంకోర్టు తీర్పులు

యిందుకు సంబంధించి వెలువడుతూవున్నా యిలానే వుంది పరిస్థితి. రాజ్యాంగంలో 21వ అధికరణం ప్రకారం జీవిత ప్రాథమిక హక్కులో భాగంగా తాగునీటి హక్కు వుందని కోర్టు చెబుతూనే వుంది. కేంద్రంలో, రాష్ట్రాల్లోవున్న ప్రభుత్వాలు ప్రజలముందు రాజ్యాంగబద్ధులమై చాటుకుంటూ వున్నాగానీ పేద ప్రజల తాగునీటి విషయంలో యెందుకింత కర్కశ వైఖరితో వుంటున్నాయి? రాజ్యాంగ యంత్రాంగం మీద సంపన్నవర్గాలకీ, బలమైన మధ్యతరగతివాళ్ళకీ పట్టు వుంది. సహజ వనరుల్ని జేబులో వేసుకునేశక్తి వుంది. (చాలా హెచ్చు సబ్సిడీలతో ప్రజల నీరు, యీ సందర్భంలో చెప్పుకోవాలంటే). పేద ప్రజలు తమకిగా తాము సంఘటితులయి బలమైన ఒత్తిడి కారకంగా తయారవలేని శక్తిహీనత కూడా ఒక కారణం కావచ్చు.

1991నుంచి, సరళీకరణ దశ తరువాత, బహుళజాతి కంపెనీలు, గడపలో కాలుపెట్టినప్పటినుంచీ సహజవనరుల మీద, ప్రభుత్వ యంత్రాంగం మీద వారి పట్టు మరింత బిగిసింది. యీ బృందాలద్వారా నీటి పథకాలు అమలు జరిపించడానికి ప్రభుత్వాలు మహా ఉత్సాహం చూపిస్తున్నాయి. దాంతో పేదలకు నిలకడగా శుభ్రమైన నీటిని సరఫరా చెయ్యాలన్న ఆతృత ఆచరణలో కలికంలో కూడా కనిపించడం లేదు. పరిస్థితులు మారేయి. యీ పరిస్థితుల్లో పేదల స్థితి, వాళ్ళు నిలదీసి అడిగే హక్కు మరింత దుర్బలమయ్యేయి. యీ బలమైన శక్తులు నీటి రంగంలో కార్పొరేట్ రంగంలో కుదుర్చుకున్న ఒప్పందాల ఛాయలో యిలా జరిగింది. నిజానికి మునిసిపల్ నీటిని నదీజలాల నీటిని మళ్లించు కోవడానికి అతిగా భూగర్భ జలాలని తోడుకోనిచ్చేందుకు కార్పొరేట్ రంగానికి అనుకూలంగా చర్యలు తీసుకునే ప్రభుత్వానికి మరింత ధైర్యం చిక్కింది. పైకి నలుగురి ముందూ ప్రభుత్వాన్ని నడిపించే అన్ని పార్టీలు రాజ్యాంగానికి బద్ధులై వున్నట్టు ప్రకటిస్తూనే వుంటాయి. అదే చిత్రం (రాజ్యాంగానికి బద్ధులై వుండడమంటే జీవించే మౌలిక హక్కుకు బద్ధులై వున్నట్లు). ప్రాథమిక హక్కుల విషయంలో కోర్టులు పౌరులకు అనుకూలంగా వుండే తీర్పులు యిస్తూనే వున్నాయి. అయితే తగినంత పరిశుభ్రమైన నీటికోసం హక్కును అమలుజరిపే స్థితిలో లేకపోవడం

లేదా కొన్ని సమయాల్లో యిష్టపడకపోవడం విచారకరం. ప్రభుత్వం తన కర్తవ్యాలనుంచి వంచనా పూర్వకంగా ముఖం చాటేస్తున్నాయి. ఆ రకంగా జీవితానికీ నీటికీవున్న ప్రాథమిక హక్కును దారుణంగా ఉల్లంఘిస్తున్నాయి. "నీటి హక్కు" అనేది ఒక నినాదంగా కుదించుకుపోతోంది.

అయితే పౌరుల సాంఘిక, ఆర్థిక హక్కుల గురించిన చైతన్యం మరింతగా పెరుగుతూ వుంది. భారతదేశంలో ఆహారం హక్కు ఆందోళన యిటీవల వూపు అందుకుంది. ఫలితాలు సానుకూలంగా వుంటున్నాయి (డ్రెజ్, 2004). ఆహార ధాన్యాన్ని దూరప్రాంతాలకు వేగంగా తరలించవచ్చు. సంక్షోభ సమయాల్లో పంపిణీకి వీలుగా ఎక్కువకాలం నిలవ వుంచనూవచ్చు. అయితే శుభ్రమైన నీటి విషయంలో యిలా చెయ్యడం కుదరదు. నీటి అవసరం అయ్యే పరిమాణమూ ఆహారధాన్యాల కంటే యెన్నో రెట్లు యెక్కువ. శుభ్రమైన నీరు అందుబాటులో వుండడం, రవాణా చెయ్యడం, నిలవ చెయ్యడం దూర ప్రాంతాలకి సంబంధించీ, కాల పరిమితికి సంబంధించీ కష్టం. యిక గడ్డు పరిస్థితుల్లో సంగతి చెప్పనే అక్కర్లేదు. పరిశుభ్రమైన నీటిని ఆహార దినుసుల్లో ఒకటిగా ప్రస్తావించుకునే ాదులు, ఆహారం హక్కు ప్రచారం ఆకలికీ, పస్తులకీ వ్యతిరేకంగా జరిగే ోరాటంలో నీటి హక్కును మరింత బలీయంగా యిముడ్చుకోవాలి.

*అనుబంధం· 1 (ఆధారం ఐక్యరాజ్యసమితి, 2002) అధికరణం 14.2 (హెచ్)*

# అధోజ్ఞాపికలు:

1. ప్రస్తుతం వున్న నిల్వలు 63 మిలియన్ టన్నులని అంచనా ధరల స్థిరీకరణకు, బఫర్ స్టాక్‌గా ఆహార భద్రతగా 17 మిలియన్ల టన్నులు సరిపోతాయన్న భావన వుంది (మాండెర్ 2003).

2. పౌరహక్కుల ప్రజా సంఘటన (పియుసిఎల్) అనే పౌర సంస్థ 2001 మే నెలలో సుప్రీంకోర్టును ఆశ్రయించింది. ఆకలినీ, షస్తులనీ నివారించేందుకు దేశంలో వున్న ఆహార నిల్వలని వినియోగించాలని అర్థించింది. దారిద్ర్యరేఖ దిగువనవున్న కుటుంబాల సంఖ్య నిర్ణయించడం ఎఫ్‌సిఐ నుంచి వాటి ఆహారధాన్యాల కోటాను తీసుకోవడం లాంటి విషయాలలో అనేక రాష్ట్ర ప్రభుత్వాల అలసత్వాన్ని యెండ గడుతూ సుప్రీంకోర్టు వ్యాఖ్యలు చేసింది మనకళ్ళెదుట యిపుడు కనిపించేది "విషాదమోదాంతం నాటకం" అని న్యాయమూర్తులు వ్యాఖ్యానించేరు. (ద హిందూ 18 సెప్టెంబరు 2001, హైదరాబాద్).

3. పరిశుభ్రమైన నీటి వల్ల ఆరోగ్యం మెరుగుపడుతుందనీ, వ్యాధులు తగ్గుతాయనీ చెప్పడానికి లోకంలో చాలా ఉదాహరణల్ని చూపించవచ్చు. రెండింటిని మాత్రం ముచ్చటించుకుందాం. హైద్రాబాద్ నగరానికి 1562లో నిర్మించిన హుస్సేన్‌సాగర్ నుంచీ, 1806లో నిర్మించిన మీర్ ఆలంచెరువునుంచీ పుష్కలంగా నీరు అందు తుండేది. సాలినా ప్రజలని పీడించే కలరా వ్యాధి యెన్నో యేళ్ళుగా కనిపించనే కనిపించలేదు. (ఇంపీరియల్ గెజెటీర్, 1909.) యీ రెండు విపరీతమైన కాలుష్యానికి గురయేయి వీటిని తాగునీటి నిమిత్తం యిక వాడడం లేదు 1928-32 కాలంలో గ్వాయాక్విల్ నగర్ (ఈక్వెడార్) జనాభాకి 24 గంటలూ నీటి సరఫరా అందుతూ వున్న సమయంలో భీతికారకమైన ఎల్లో ఫీవర్ అదృశ్యం అయిపోయింది. కాని 1938లో నీటి కాలుష్యంతోబాటు, అందుబాటూ సమస్యాత్మకం కావడంవల్ల ఆ వ్యాధి అక్కడ తిరిగి తలయెత్తింది (స్వాంగెడెవ్, 1997)

4. యీ హక్కుల్లో కొన్ని: "ఏకాంత హక్కు", విదేశీయాన హక్కు", న్యాయపరసహాయ హక్కు", "వైద్య సదుపాయం హక్కు", "ఇంటి హక్కు", త్వరితగతి విచారణ హక్కు", "కాలుష్య రహిత గాలి, నీరు హక్కు "సవ్యమైన నివాసం హక్కు", "ఆహారం, బట్ట, పరిశుభ్రమైన ఆరోగ్యపరమైన పరిసరాల హక్కు (వేణుగోపాల్, 2003.)

5 ఎస్.పి. గుప్తా తదితరులు భారత రాష్ట్రపతి, యితరులు (1982) వ్యాజ్యంలో సుప్రీంకోర్టు ప్రజాహిత వ్యాజ్యాన్ని యిలా నిర్వచించింది "మౌలిక మానవ హక్కులు లేని ప్రజా బాహుళ్యానికి న్యాయం అందుబాటులోకి వచ్చేటట్టు చేసే న్యాయపర వ్యూహాత్మక రచన, అలాంటి నిర్ధారిత ప్రజలవర్గానికి జరిగిన అన్యాయానికి, హానికి న్యాయపరమైన వెసులుబాటు."

6. ఎ.పి కాలుష్య నియంత్రణా మండలి × ప్రొ.ఎమ్.వి.నాయుడు, తదితరులు (సివిల్ అప్పీల్ నం. 368-373,1999) జాన్ లీ రైట్ టు హెల్దీ ఎన్విరాన్‌మెంట్" నుంచి ఉల్లేఖన. కొలంబియా జర్నల్ ఆఫ్ ఎన్విరాన్‌మెంటల్ లా" సంపుటి.25.2000)

7. పైన పుటంకించినదే ఆధారం

8 హైద్రాబాద్ నగరానికి తాగునీటిని సరఫరా చేసే ఉస్మాన్ సాగర్, హిమాయత్ సాగర్ రెండింటికీ పది కిలోమీటర్ల పరిధిలో నీటి కాలుష్యం కలిగించే పరిశ్రమను స్థాపించే విషయాన్ని పరిశీలిస్తూ కోర్టు నిషేధించింది యీ రెండు నీటి వనరుల్నీ షరిరక్షించే "ముందు జాగ్రత్త" (precautionary principle)నియమాన్ని కోర్టు అనువర్తింపచేసింది.

9. పంచవర్ష ప్రణాళికలకి సంబంధించిన సమాచారాన్ని ప్లానింగ్ కమీషన్ వెబ్‌సైట్ www planning commission nic in నుంచి తీసుకోవడం జరిగింది

10 దక్షిణ ఆసియాలో దాదాపు మూడింట రెండువంతుల మంది పిల్లలు తగినంత బరువు వుండడం లేదు సబ్ సహారా ఆఫ్రికన్ పిల్లల్లో యిది ఆరింట ఒక వంతు వుంది మరి దక్షిణ ఆసియాలో సబ్ సహారన్ ఆఫ్రికా స్థితితో పోలిస్తే పెరుగుదల నిష్పత్తులూ, పుష్టికర ఆహారం ఉత్పత్తీ యెక్కువ (హాక్, 1997).

11. జాతీయ తాగునీటి మిషన్(భారత ప్రభుత్వం) ప్రకారం అవసరమైన కనీస నీటి పరిమాణం 40 ఎల్‌పిసిడి. ఐక్యరాజ్యసమితి ప్రకారం అయితే యిది 50 ఎల్‌పిసిడి. (జనరల్ కామెంట్ నం 15 )

12. ఆంధ్రప్రదేశ్‌లోని నల్గొండ జిల్లాలో 3359 ఆవాసాల్లో (గ్రామాలు) 1122 మంది హెచ్చు స్థాయి ఫ్లోరైడ్ తాగునీటిలో వుండడం వల్ల బాధపడుతున్నారు. 200 పైబడ్డ గ్రామాల్లో దారుణమైన 'ఫ్లోరైడ్ స్కెల్‌టల్ ఫ్లోరోసిస్' పీడిస్తోంది యీ జబ్బువల్ల మెడ, వెన్ను గట్టిపడిపోతాయి ఛాతీ దెబ్బతింటుంది. ఎముకలు వంకర్లు పోతాయి. సామాన్యంగా అడపాదడపా వచ్చే నొప్పులు వగైరా వుంటాయి యీ వ్యాధి రాష్ట్రంలో కొన్ని ప్రాంతాల్లో వుంది బీహార్, కేరళ, మహారాష్ట్ర, పంజాబ్, తమిళనాడు లాంటి రాష్ట్రాల్లోనూ యీ వ్యాధి వుంది. ఫ్లోరోసిస్ పెద్దవాళ్ళ కంటే యెక్కువ పిల్లలకి సోకుతుంది (ఐఎల్ఆర్ 2001).

13 బ్రిటన్‌లో, లాటిన్ అమెరికా, ఆఫ్రికాలో నీటి చార్జీలను చెల్లించని/చెల్లించలేని యిళ్ళకు నీటి సరఫరాను ప్రైవేటు కంపెనీలు, భారీస్థాయిలో తొలగించిన ఉదాహరణలు కోకొల్లలు www psiru.org లో యెన్నో వ్యాసాలు కన్పిస్తాయి. ఎమ్ఎన్‌సిలు, ప్రపంచ బేంకు నిర్వహించిన పాత్ర గురించి, ముఖ్యంగా ఆఫ్రికా, లాటిన్ అమెరికా దేశాల్లో వాటి పాత్ర గురించి తెలియజేస్తాయి.

14. హైదరాబాద్‌లో ముఖ్యమంత్రి, మంత్రులు, సీనియర్ అధికారులు పాల్గొనే అధికార సభలూ, సమావేశాలూ వుంటాయి. వీటినుంచి అందే సందేశం యేమిటీ అంటే మునిసిపల్ నీరు ప్రముఖులు (విఐపి)లు తాగడానికి పనికిరాదు అని. అంటే నీరు సాదా సీదా జనానికి మాత్రమేనని. ఆం.ప్ర. సచివాలయ అధికార సమావేశాలన్నింటిలోనూ మునిసిపల్ నీళ్ళకు బదులు బల్లలమీద బాటిల్ నీళ్ళే దర్శనమిస్తూ ఉంటాయి (ద హిందూ, జూలై 11, 2003, హైద్రాబాద్).

15. 2004లో భారతదేశంలో కోకాకోలా 40 వేలకి పైబడి గ్రామాల్లో చొచ్చుకుపోబోతూ వుంది యిప్పటికే 2 లక్షల గ్రామాలకి యిది వ్యాపించింది. దేశంలో యీ శీతల పానీయ వినిమయం గత యేడాది వున్న తలసరి 10 నుండి 15కు పెరగాలని

కంపెనీ చూస్తోంది వినిమయదారులసంఖ్య కూడా 240 మిలియన్ల నుంచి 300 మిలియన్లకి పెరగాలని కంపెనీవారు ఆశిస్తున్నారట (బిజినెస్ లైన్, మే 6, 2004).

16. హైద్రాబాద్ స్థానిక ప్రసార మాధ్యమాల్లో యీ బాపతు వార్తలు అడపాదడపా వస్తూనే వుంటాయి. బల్లి అవశేషాలు, సిగరెట్ పీకల్లాంటి హానికరమైనవి కోక్, పెప్సీ శీతల పానీయ సీసాల్లో కనిపిస్తూ వుండడం అయితేనేం గాక! వ్యాపారం సజావుగా సాగిపోతూనే వుంటుంది!

17. కేరళ రాష్ట్రంలో కోకాకోలా భారీగా భూగర్భ జలాల్ని తోడెయ్యడంవల్ల ఆ చుట్టు పక్కల ప్రాంతాల్లో అనేక గ్రామాలకి నీటి వనరులు అడుగంటి పోయేయి. 2002 ఏప్రిల్ నెలలో నిరసనోద్యమం గ్రామస్థుల నిర్వహణలో నడిచింది. కోకాకోలా ప్లాంట్‌ని మూసివెయ్యాలని డిమాండ్ చేశారు. స్థానిక గ్రామ పంచాయితీ హైకోర్టులో అర్జీ దాఖలు చేసుకుంది. దానిమీద కోర్టు పై తీర్పు యిచ్చింది. గ్రామీణ సంపదని యింతలా కొల్లగొట్టే హక్కు కంపెనీకి లేదని చెప్పింది (ద హిందూ, డిసెంబరు, 17, 2003 హైద్రాబాద్ )

18. భారతదేశంలో నీటి వ్యాపార రంగంలో వున్న కొన్ని బహుళజాతి సంస్థలు. కోకాకోలా, పెప్సీకోలా, పెప్సి, బెచెల్, నెస్లె, లివెండి,సూయెజ్‌ల్సోనాసె నార్తంబ్రియన్ వాటర్, నార్త్ వెస్ట్ వాటర్, యునైటెడ్ ఇంటర్నేషనల్.

19. ఫీవర్ హాస్పిటల్‌లోనే కాకుండా, నగరంలోని అనేక ప్రభుత్వ, ప్రైవేట్ హాస్పిటళ్ళలో రోగులు చేరుతున్నారు. స్థానిక పత్రికలు సేకరించిన సమాచారం ప్రకారం 2706 మంది అనేక హాస్పిటళ్ళలో చేరారు. పిల్లలతో సహా 47 మంది అనేక ప్రాంతాల్లో చనిపోయేరు 2003 సంవత్సరంలో ఏడు నెలల కాలంలో నీటి, పారిశుధ్య సంబంధ వ్యాధులతో బాధపడే 96000 మందికి ఫీవర్ హాస్పిటల్‌లో చికిత్స జరిగిందని ఒక తెలుగు పత్రిక తెలియజేసింది. 2002లో యీ సంఖ్య 162000 వుంది (ఆంధ్రజ్యోతి, దినపత్రిక 23 జులై 2003).

20 దాదాపు 80 యేళ్ళ కాలంలో మొట్టమొదటిసారిగా ఉస్మాన్‌సాగర్, హిమాయత్‌సాగర్ రిజర్వాయర్లు 2003లో యెండిపోయేయి. వీటిమీదే ఆధారపడిన ప్రజలు నీటికోసం నానా యిక్కట్లూ పడ్డారు. యెన్నో ప్రభుత్వ ఫర్మానాలు, కోర్టు తీర్పులు వున్నాగానీ వాటి పరీవాహక ప్రాంతాన్ని పరిరక్షించడంలో ప్రభుత్వం యేమంత శ్రద్ధపెట్టలేదు.

21 హైదరాబాద్‌లోని ఉస్మానియా హాస్పిటల్ నెలవారీ తీసుకునే నీటి పరిమాణం పరిశీలిస్తే ఒక విషయం తేటతెల్లమవుతుంది. 2003లో అది తీసుకున్న నీరు 2000 సంవత్సరంలో తీసుకున్న దానికంటే మూడింట ఒకవంతు, కొన్ని సందర్భాల్లో ఆరవవంతు తక్కువ. రాష్ట్రంలోవున్న అతిపెద్ద హాస్పిటళ్ళలో యిది ఒకటి. దీని ఆర్థిక పరిస్థితీ అంత సవ్యంగా లేదు

## References

AIDWA (no date) 'The Story of how Coke Deprives a Community of Water', All India Democratic Women's Association, Maharashtra

Anton, Danilo J. (1993) *Thirsty Cities: Urban Environments and Water Supply in Latin America*, Ottawa. International Development Research Centre.

APPEN (1998) *Water Watch* (A Community Action Guide), Asia-Pacific People's Environmental Network, Penang, Malaysia

Aurora, P.L (1999) 'Pricing Structure and Demand Management of Delhi Water Supply', *Local Government Journal*, Mumbai, Vol. 70, pp 167-175.

Bakker, Karen J. (2001) 'Paying for Water. Water Pricing and Equity in England and Wales', *Transactions of the Institute of British Geographers*, Vol 26, No. 2, pp 143-64

Budds, Jessica and Gordon McGranahan (2003) 'Are the Debates on Water Privatisation Missing the Point? Experiences from Africa, Asia and Latin America', *Environment and Urbanisation*, Vol 15, No 2, pp 87-114.

Down to Earth (2003) 'Gulp - Bottled Water has Pesticide Residues', *Down to Earth*, Vol. 11, No 18, February 15

Down to Earth (2003) 'Colanisation's Dirty Dozen', *Down to Earth*, Vol. 12, No 6, 15 August

Dreze, Jean (2004) 'Democracy and Right to Food', *Economic and Political Weekly*, Vol. XXXIX, No. 17, April 24, pp. 1723-31

Dreze, J., and A. Sen (2002) India: Development and Participation, Delhi: Oxford.

Dreze, J., and A Sen (eds) (1996) *Indian Development. Selected Regional Perspectives*, Delhi. Oxford

Gleick, Peter (2002) 'A Plan of Action to Protect the Global Water Commons' (source: www.canadians.org/blueplanet accessed in February 2002).

Gleick, Peter (1999) 'The Human Right to Water', *Water Policy*, Vol.I,No.5,pp, 487-503.

GoI (1996) *The India Infrastructure Report: Policy Imperatives for Growth and Welfare* (Expert Group on the Commercialisation of Infrastructure Projects), Ministry of Finance, Government of India, New Delhi.

GoI (1986) *Constitution of India* New Delhi: Government of India

Gusky, Sara and Maj Fil-Flynn (2004) 'Will the World Bank Back Down? Water Privatization in a Climate of Global Protest', A special report by Public Citizen's Water for All Program (accessed on 18 May 2004 from www wateractivist org)

Gutierrez, Eric (2001) 'Framework Document: A Survey of the Theoretical Issues on Private Sector Participation in Water and Sanitation', Water Aid and Tearfund

Haq, Mahbub ul (1997) *Human Development in South Asia 1997*, Karachi Oxford

ILR (2001) *The Indian Law Reports, Andhra Pradesh Series, Volume II*, Part I, Hyderabad

Imperial Gazetteer of India (1909) *Provincial Series-Hyderabad State*, Hyderabad.

ISODEC (2002) Report of the International Fact Finding Mission on Water Sector Reform in Ghana, Integrated Social Development Center - Public Citizen/Water for All, Ghana, August (source: www.citizen.org/documents accessed on 24 August 2002)

Kalbermatten, J (1999) 'Should we pay for Water? And, if so, how', *Urban Age*, Vol 6, pp.14-15.

Krishnakumar, Asha (2003) 'A sanitation emergency' (Issues in Focus), *Frontline* (Internet edition), Vol 20, No. 24, November 22 - December 05.

Kundu, Amitabh (1994) 'Poverty and Planning', *Economic and Political Weekly*, 25 June, pp 1569-72

Kundu, Amitabh (1992) *Urban Development and Urban Research in India*, New Delhi: Khanna.

Lisbon Principles (2002) 'The Local Government Water Code', *TUGI's Urban Links*, 32, January

Mahendra Dev, S (2003) 'Right to Food in India', Working Paper No 50, Centre for Economic and Social Studies, Hyderabad

Mander, Harsha (2003) 'Hunger Unseen: No Takers for the Other Half', *Times of India*, 2 January.

Mathur, O P. (2000) 'Coming to Grips with Issues of Pricing Urban Water and Intra-City Bus Transport', Paper presented at a conference on India: *Fiscal Policies to Accelerate Economic Growth*, New Delhi, 21-22 May.

Moench, Marcus and S. Janakarajan (2002) 'Water Markets, Commodity Chains and the Value of Water', Chennai: Madras Institute of Development Studies.

NCU (1988) *Report of the National Commission on Urbanisation*, Vol II, National Commission on Urbanisation, Government of India, New Delhi.

NSSO (1999) *Drinking Water, Sanitation and Hygiene in India*, January-June 1998, National Sample Survey Organisation, 54th Round, Report No. 449, Government of India, New Delhi

Parikh, K S , Jyothi Parik, Raghu Ram and L Tata (1999) 'Air and Water Quality Management. New Initiatives Needed' (pp 85-97) in Parik, K S (ed) *India Development Report 1999-2000*, IGIDR, Mumbai Oxford.

Petrella, Riccardo (2001) *The Water Manifesto* (Arguments for a World Water Contract). Bangalore: Books for Change

Raina, Vinod (2002) 'War over Water: Water flows Uphill to Money', Combat Law, Vol. 1, No. 3, pp 18-22

Robbins, Peter T. (2003) 'Transnational Corporations and the Discourse of Water Privatisation', *Journal of International Development*, Vol 15, No.8, pp.1073-82.

Sen, Amartya (1990) 'Food Entitlement and Economic Chains' pp. 374-86, in Lucile F Newman (ed ) *Hunger in History: Food Shortage, Poverty and Deprivation*. Basil Blackwell: Oxford.

Sengupta, Arjun (2001) 'Right to Development as a Human Right', *Economic and Political Weekly*, Vol. XXXVI, No 27, pp 2527-36.

Sharma, Sudhirendar (2002) 'Water Privatisation - *Torrent of Trouble*', *Business Line* Internet Edition (India), May 30.

Shiva, Vandana (2002) *The World Bank, WTO and Corporate Control over Water*, Navadanya New Delhi.

Shiva, Vandana, Radha Holla Bhar, Afsar H. Jafri and Kunwar Jalees (2002) *Corporate Hijack of Water* (How World Bank, IMF and GATS-WTO Rules are Forcing Water Privatisation), Navadanya: New Delhi

Sinha, Satyabrata (2001) 'Environmental Protection. Role of Constitutional Courts', in Contribution of the *Andhra Pradesh High Court in the Development of Constitutional Law*, High Court of Andhra Pradesh, Hyderabad

Smets, Henri (1999) 'Implementing the Right to Drinking Water in OECD Countries', OECD Seminar on the Social and Environment Interface, 22-24 September, Paris.

Swyngedouw, E (1997) 'Power, Nature and the City. The Conquest of Water and the Political Ecology of Urbanisation in Guayaquil, Ecuador 1880-1999', *Environment and Planning A*, Vol 29, No 2, pp. 311-332.

United Nations (2002) Economic and Social Council, Committee on Economic, Social and Cultural Rights, Twenty-ninth session, Geneva, 11-29 November, General Comment No. 15 (source: www.citizen.org/documents/therightowater.pdf accessed on 29 November 2002).

United Nations (1995) *The United Nations and Human Rights 1945-95*, The United Nations Blue Book Series, Vol. VII, United Nations Publications, New York

Venugopal, K.K (2003) 'Supreme Court and the Common man', *The Hindu*, 19 December.

World Bank (1997) China 2020: *Development Challenges in the New Century*, The World Bank, Washington D.C.

**Annexure I (source: United Nations, 2002)**

Article 14.2(h), Convention on the Elimination of All Forms of Discrimination Against Women (1979); Article 24.2(c), Convention on the Rights of the Child (1989); Articles 20, 26, 29 and 46, Geneva Convention III (1949); Articles 85, 89 and 127, Geneva Convention IV (1949); Articles 54 and 55, Additional Protocol I of 1977, Articles 5 and 14, Additional Protocol II (1977); Preamble, Mar Del Plata Declaration of the United Nations Water Conference (1977); Paragraph 18 47, Agenda 21, Report of the United Nations Conference on Environment and Development (1992); Principle No.3, The Dublin Statement on Water and Sustainable Development, International Conference on Water and the Environment (1992); Principle No.2, Programme of Action of the United Nations International Conference on Population & Development; Paragraphs 5 and 19, Recommendation Rec (2001) 14 of the Committee of Ministers to Member States on the European Charter on Water Resources; and Promotion of the Realization of the right to drinking water, Sub-Commission on Human Rights resolution 2001/2. Principles relevant to the right to drinking water have been recognised in Paragraph 9, Final Declaration, International Conference on Water and Sustainable Development, Paris, 1998; Paragraph 5(d), World Summit for Children Plan of Action of 1990; New Delhi Statement, Global Consultation on Safe Water and Sanitation of 1990; Paragraphs 92, 93, and 106, Beijing Platform for Action (1995); Secretary-General, Progress made in providing safe water supply and sanitation for all during the 1990s, Commission on Sustainable Development, 8th Session, 2000; and UN Convention of the Law of Non-Navigational Uses of Watercourses (1997).